PRBVM02A163

సాహిత్య
ప్రస్థానం
సెప్టెంబర్ 2015
సంపుటి : 14 సంచిక : 9

## మనవి

పుష్కర కాలంగా తెలుగు సాహిత్యాభిమానులను అమితంగా అలరిస్తున్న సాహిత్య ప్రస్థానం పత్రిక కార్యాలయం అక్టోబరు నెలనుంచి విజయవాడకు మారుతున్నది. 2014 జూన్2న జరిగిన ఆంధ్ర ప్రదేశ్ విభజన ఇందుకు నేపథ్యం. సాహిత్య ప్రస్థానం తెలుగు రాష్ట్రాలైన ఆంధ్ర ప్రదేశ్ తెలంగాణ రెండు చోట్లా పాఠకాదరణ పొందుతున్నది. నిజానికి భిన్న స్రవంతులకు స్వరాలకు చెందిన పురోగామి సాహిత్య జీవులకు ఒక వేదిక కల్పించడం ప్రస్థానం మౌలిక లక్ష్యాల్లో ఒకటి. అందుకే అన్ని చోట్లా అనేక కార్యక్రమాలు నిర్వహించింది. విభజనానంతరం సాహితీ స్రవంతి కేంద్రం విజయవాడకు మారినందువల్ల ప్రస్థానం పత్రిక సంపాదక చిరునామా కూడా మారుతున్నది. అయితే తెలుగువారందరి పత్రికగా ఇకముందు కూడా అటు సృజన శీల రచనలకూ ఇటు విమర్శనా వ్యాసాలకూ ప్రస్థానం స్వాగతం పలుకుతుంది. రెండు చోట్లా సమాన స్థాయిలో రచయితలూ, చందాదారులున్నారు. భవిష్యత్తులో పత్రిక మరింత పటిష్టమై ఇంకా విస్తరించేలా చూడాలన్న ప్రణాళికలూ వున్నాయి. దేశంలోనే అభివృద్ధి నిరోధక మతతత్వ శక్తుల సవాళ్లు తీవ్రమవుతున్న సందర్భమిది. అంతర్జాతీయంగానూ ఆధిపత్య సామ్రాజ్యవాద ప్రపంచీకరణ పెనుతాకిడి కొనసాగుతున్నది. భావ ప్రకటనాస్వేచ్ఛపైన సామాజిక న్యాయం ఆర్థిక సమతాభావనలపైన దాడి తీవ్రమవుతున్నది. ఈ పరిస్థితుల్లో ప్రగతిశీల సాహిత్యకారుల విశాల ఐక్యత అత్యావశ్యకమవుతున్నది. అలాగే ఈ కర్తవ్య నిర్వహణకు ప్రజలను సమాయత్తం చేసేందుకై శక్తివంతమైన రచనల అవసరం కూడా పెరుగుతున్నది. ఈ దిశగా సాగే 'ప్రస్థానం'లో మీ అందరి భాగస్వామ్యాన్ని ఆహ్వానిస్తున్నాం. అండదండలు అభ్యర్థిస్తున్నాం

- తెలకపల్లి రవి

బొమ్మలు : తుంబలి శివాజీ, గంగాధర్, మీరా

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020
మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# సెహనాయి మేలుకో

◆ డా॥ సోమసుందర్ ఆవంత్స
9347848905



మంగళకర తూర్యారావమై
నవ యుగోదయ స్నిగ్ధ హాసమై
దయ చేయవా సెహనాయి
నీ రాక కార్తీక పూర్ణిమా నిషాంతమై...
కొస వెన్నెలల కోటి ఆశా కిరణాలై
ప్రసరించగా – నీ మెలకువ
మా వీనులకందిన కల రూపమై
తీయని పిలుపై నవ్యాగమ తరంగమై
తారుణ్యోదయ తోరణమై
జాగృత భవ్యాలోక పవమానమై...
సెహనాయి మరల దయసేయు

నీ నిట్టూర్పుతో మా తనూతలం
భూ తలమై విస్తరించింది
భూతాలను తరిమింది
శృతులను నిర్జించింది

సప్త దశాబ్దాల సంగీత వసంతాలతో
మా రసపీయూషాల తనియించింది
మా హృదయాలలో పుష్పద్రుమాలను
పెంపొందించింది
కార్యోత్సవ శీలిగా...
జీవదాశా పర్వాలు రచించింది
పురోగమన వాహినిగా...
సెహనాయి నీ దివ్య నేత్రాలతో
ఎన్నినాద మరంద ధారల
పరంపరలు
ఎన్నెన్ని కళ్యాణ సమూహాలు–
వీక్షించావో – రక్షించావో
పునాద తరంగాలు తేల్చావో
సెహనాయి
బ్రతుకు కనుమల నింపిన
ఎన్ని కన్నీళ్ళను పోకార్చావో
దొంగ రాత్రుల
ముళ్ళబాటలు దాటించావో–
నీవు ప్రదర్శించిన అజరామర
సురుచిరలోకాన్ని
ఈ విడు మరలేని బెంగల
బాష్పవారిని నింపావో
వేదనా జడమయ నేత్రాలతో
చూడలేక
శృతులను సంధించే అనుభూతుల
గంగాతరంగ మాలికల మంజుల
గానంలో
దోసిళ్ళతో కలిపావో

నీ నిశ్వాసాలను రసవీచికలుగా
మార్చ మా
మస్తకాలకు మణిమయ మకుటాలు
కీలించి

అలంకరించావే సెహనాయి
జాగరించు, ఈ శతాబ్దాన్ని సైతం
గుస్తరించు
సమస్తీకరించు సంగీత ధునీ మేలుకో!
నిరామయనిస్తుల తేజంతో....
విరామ రహిత వీచే నివహంతో ...

## జూలై నెల పురస్కారాలు





**సవాలు**
కథకు: రూ. 700/-
రచయిత : డా॥ ఎస్. రామచంద్ర

**నానీలు**
కవితకు : రూ .500/-
రచయిత : కె. సరస్వతి

సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

◆

వ్యాసం : ప్రపంచీకరణపై ఎక్కుపెట్టిన కవిత్వం 'కాలంమీద సంతకం' రచయిత : పవన్‌కుమార్‌రెడ్డి




ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ. 500/- అందజేయబడుతుంది

◆

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని
ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

– ఎడిటర్

కథ




# పాసు బుక్కు

• షేక్ హుసేన్ సత్యాగ్ని
9866040810

"దిల్‌గిర్ అయి అట్లా కూర్చున్నా వేంది? లేసిరా, వట్టి చేపలేసి ఎఱ్ఱమిరపకాయ నలిసినా, ఉడుకుడుగ్గా ఒక ముద్ద సంగటి తిని సందెకాడనే పండుకుంటే, పొద్దునికల్లా బెట్ట ఇడిసిపోతాది" - అంది మాలంబి, ఇంటిముందు వేప చెట్టు కింద దిగులుగా కూర్చున్న మొగున్ని చూసి. ఈ రోజు కూడా పోయిన పని కాలేదని, దాదాసాహెబ్ మొహం చూస్తేనే కనుక్కొనిందామె. పరిస్థితులను బట్టి భర్తను బుజ్జగించడం ఆమెకు మామూలే.

గోముగా ఆమె పలకరింపు చెవిన పడతానే దాదేసాబ్ మనసు కరిగిపోతుంది. జరిగింది మర్చిపోయి ఉల్లాసం నిండుకుని హుషారెక్కుతాడు. కానీ ఆరోజు ఉలకలా పలకలా! రెప్పలార్పకుండా ఆమెనే చూస్తున్నాడు. అతనికి తెలియకుండానే కళ్లలో నీళ్లూరినాయి.

"మన కష్టాలు అల్లాతో చెప్పుకోవాలగానీ, మనుషుల్తో చెప్పుకుంటే ఆరుస్తారా, తీరుస్తారా! మన ముఖద్దర్‌లో ఎట్లా రాసి ఉంటే అట్లా జరుగుతాది. ఫికర్ చేసుకోవాకు. తబియత్ ఖరాబయితాది. రారా! నూకలుడికుంటాయ్. రాగిపిండేసి కెలికి, పళ్లెంలో యేస్తా!" అంటూ బెరబెరా లోపలికి నడిచింది మాలంబి.

చేపల కారం అంటే దాదేసాబ్ ప్రాణం పీకుతాది. బిరియాని కూడా దాని ముందు దిగదుడుపే.

ఆరోజు మాత్రం సంగటిమింద మనసు పోలే. అయిష్టంగానే లేచి జాలాట్లోకి పోయి కాళ్లు మొహం కడుక్కుని కొట్టంలోకి పోయాడు.

నిట్టాడు పక్కన పరిచిన గోనెసంచిపట్ట మింద కూర్చున్నాడు. తన పెద్దకూతురు చెంబుతో నీళ్ళు పెట్టింది. తన యెదురుగా చిన్నపిల్లలిద్దరూ సిల్వర్ గిన్నెలు పెట్టుకుని, వాళ్ల అమ్మి ఎప్పుడెప్పుడొస్తుందా అని లొట్టలేసుకుంటూ ఆత్రపడుతున్నారు.

అందరికీ వడ్డించి పెనిమిటి పక్కన తానూ కూర్చుంది మాలంబి.

"ఈ ఛోటాగాడే ఈదిలోని పిల్లోలందర్నీ ఇంట్లోకి తెచ్చి ఆడుకుంటుంటాడు. ఏ పిల్లోడెత్తక పోయినాడో, వీంతోనే మనకు పెద్ద తిప్పలొచ్చి పడినాయ్" అన్నది, చిన్న కొడుకు వైపు కోపంగా చూస్తూ.

దాదేసాబ్ కున్న ఎకరా 60 సెంట్ల పాస్ బుక్కు 6 నెలల కిందట పత్తా లేకుండా పోయింది. బ్యాంకులో క్రాప్‌లోన్ కోసం అవసరమై ఇల్లంతా జల్లెడ పట్టినారు. కనిపించలే. చుట్టుపక్కల వాళ్లనూ అడిగినారు. ఎవరూ మాకు తెలీదు. మాపిల్లోడేం తేలేదు. మేము చూడలేదన్నారు.

అప్పటినుండి కొత్త పాస్‌బుక్కుల కోసం మండలాఫీసు చుట్టూ తిరుగుతూనే ఉన్నాడు దాదేసాబ్.

'ఈ పొద్దు పని అయిపోతాదన్నావే ఏమైంది?' అని, భర్త వైపు చూచింది మాలంబి.

దాదేసాబ్ నోట్లో పెట్టుకున్న సంగతి పిడస దిగమింగి, "ఈ పొద్దు డూప్లికేట్ పాస్‌బుక్కు ఇస్తాం రమ్మన్నారు. తీరా ఆడికి పోయినాక ఆ మీటింగు... ఈ మీటింగు అని మాపటిదాకా కూకోబెట్టుకుని, ఎమ్మార్వో ఇంటికి బోతూ, నన్ను పిలిచి ఏందో కొత్త తిరకాసు పెట్టిపోయినాడు."

మాలంబి తటాలున 'ఏందంట?' అనడిగింది భయంగా, ఆత్రుతగా.

"అదేందో ఇండెమీ... ..." అని, తటపటాయిస్తూ, "నాకు పలకడం రాదు. అంగ్రేజీలో చెప్పినారు." అన్నాడు దాదేసాబ్.

మాలంబికి ఉరువే అర్థం కాలేదు. అర్థం కాని దాని మీద మళ్ళా మళ్ళా అడగడమెందుకని, సంగతి మింగుతూ కూర్చుండి పోయింది.



ఎమ్మార్వో చెప్పిన 'ఇండేమీ...' యేందో అర్థం కాక దాదేసాహెబ్, అప్పుడే వీఆర్వోను అడిగినాడు.

అతను 'పూచీకత్తయ్యా' అని గదిమినట్లు చెప్పినాడు.

తాను నసుగుతూ 'అప్పుడే అపిడెవిట్ ఇచ్చినాను కదా, నువు అడిగితే' అన్నాడు.

'అది చెల్లదు పోవయ్యా, చట్టాలు మారినాయ్!' అని చీదరించుకుంటూ పక్కకు దాటిపోయాడు వీఆర్వో.

రోజుకొక తీరుగా, రోజుకొకటి తెమ్మంటున్న అధికారులను తిట్టుకుంటూ దాదేసాబ్ దిగులుగా ఇల్లు చేరినాడు.

ఇవన్నీ తనకే అర్థం కావడం లేదు. ఇంక తన భార్యకేమర్థమవుతాయనుకున్నాడు, ఒక నిట్టూర్పు విడుస్తూ.

'మన భూమికి, మనకు పాసుబుక్కు యియ్యడానికి యిన్ని తిరగడలేందో! ఇస్తారో యియరో!' అని సణుక్కుంటూ, పళ్లెంలో చెయి కడుక్కున్నాడు.

'యేందోబ్బా! లోకంలో లేని పాసుబుక్కు మనకే యిచ్చినట్లు. ఆరునెల్లుగా తిప్పుతండారు. ఆ కడా ఇంటి ప్రసాదు ఐదురోజుల్లో తెచ్చుకున్నేడు. మన కర్మేమో ఇట్లా కాలింది' అని యాసిరిక పడింది మాలంబి.

'దళారి అల్లాబకష్‌ను మొన్న కూడా అడిగినా, 'ఏదన్నా దావ ఉంటే చెప్పురా' అని. వాడు అప్పుడూ ఇప్పుడూ ఒకటే మాట చెప్తాండాడు. ఎమ్మార్వో ఆఫీసులో పదివేలు, పై ఖర్చులకు రెండువేలు ఖర్చుపెట్టంది నీకు పాసుబుక్కు రానేరాదని'. అంటూ వెనక్కు జరిగి నిట్టాడుకు వీపు ఆనించాడు దాదేసాబ్.

'హోమ్మో, అంత లెక్కా? యాడ తెస్తం. ఉండే భూమి అమ్ముకోవాల్సిందే' అంటూ ఆదరాబాదరాలేచి ఎంగిలి గిన్నెలు సర్దుకుంది మాలంబి.

దాదేసాబ్‌కు చీకటీగల వలె ఇక్కట్లు ముసురుకున్నాయి.

* * *

ఊర్లో మసీదు కివ్వాల్సిన నెలచందా నూర్రూపాయలు ఇప్పటిదాకా ఇవ్వలేదు. మసీదు పక్క కనపడితే మౌజన్ పంకిస్తాడని, ఆ పక్కకే పోవడం లేదు.

నెల కిందట తీసుకున్న యాటకూర (మాంసం) లెక్కకు, వీధిలో కనపడితే 'ఏం వోయ్' అని చేయి వెల్లకిలేస్తూ మొఖం చుండ్రగిస్తున్నాడు గుర్రప్ప. అతనికి కనపడకుండా తప్పించుకుని తిరగాల్సి వస్తోంది.

స్టోరు బాషాను కాళ్ళావేళ్ళాబడి రూపాయి బియ్యం అప్పు తెచ్చుకుని పూట గడుపుకుంటుంటే, అయి కూడా అయిపోవచ్చినా యంటాంది మాలంబి.

రైతుల పొలాల్లో కూలికి పోయి ఇల్లు గడుపుతూండేది మాలంబి. ఇపుడు పనుల కాలం కూడా కాకపాయె. అడపా దడపా యెప్పుడన్నా ఒకటీ అరా కూలి దొరికితే, ఎమ్మార్వో ఆఫీసుకు రానూపోనూ ఛార్జీలకు సరిపాయె.

బుల్లెద్దు మెత్తబడింది. ఈ ఏరువాక సేద్యానికి కూడా పనికిరాదు. ఎట్లోకట్ల దాన్ని మార్చాల. యెద్దులకు మేత కూడా లేదు. వరిగడ్డి కొని మేపాలంటే వల్లకాదు. అస్తులు పస్తులుతో బక్కచిక్కి పోతుండాయి.

మడి దున్నకాల్లో సేద్యానికి వస్తానని అబ్దుల్లా దగ్గర తీసుకున్న రెండువేలు కూడా, ఆ ఆఫీసులో ఈ ఆఫీసులో చిన్నా చితకా వాళ్ళకు లంచాలకు కసిగిపోయింది.

ఆ ముదనష్టపు పాసుబుక్కు పోయినప్పటినుండీ ఎమ్మార్వో ఆఫీసుకు, ఇంటికి తిరిగి తిరిగి దావపడింది. పైసా సంపాదన లేదు.

'క్యాజీ, హాయ్‌బత్‌లో మునిగిపోయినవ్. పదిరోజులుగా పాణం బాగలేదని గోలీలు తింటండవ్. అల్లా దయ పెట్టి ఎప్పుడు యిప్పిస్తాడో అప్పుడే వస్తాదిలే. పొద్దుగూకులూ నువు ఇట్లా మనసు పాడుచేసుకుంటే, ఏమన్నా అయితే మా గతి ఎట్లా సెప్పు. లేచిరా, మంచం వంచుతా

పండుకుందువు.' – మాలంబి మాటతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు దాదేసాబ్.

ఉన్న ఒక్క మంచం మీద చిరిగిపోయిన బొంత పరిచింది దాదేసాబ్‌కు. తానూ, పిల్లలూ ఈతచాప పరుచుకుని కింద పడుకున్నారు.

చీకటీగలు 'గుయ్' మని రొద చేస్తూ దోసిళ్ళతో కుమ్మరించినట్లు వచ్చి పడుతున్నాయ్. పిల్లలు మూలుగుతూ అటూ ఇటూ పొర్లుతున్నారు.

'సోజావ్ బేటీ, సోజావ్' అంటూ వాళ్ళ వీపులు తడుతూ బుజ్జగిస్తూంది మాలంబి.

రోజూ పచ్చి వేపాకు తెచ్చి పొగ వేసేవాడు దాదేసాబ్. ఆ రోజు ఆ ఊసే మర్చిపోయాడు.

అలికిడైతే బిడ్డలు నిద్రపోరని, కదలకుండా కళ్ళు మూసుకున్నాడుగానీ, సగిరపొద్దయినా నిద్రపట్టలేదతనికి. పాసుబుక్కు కోసం తనను చెండాట ఆడుకున్న ఉద్యోగుల లీలలన్నీ క్రమంగా మనసులో మెదిలినాయి.




* * *

'పాసు బుక్కు పోయింది, కొత్తది కావా'లని ఆరునెల్ల కిందట ఎమ్మార్వో ఆఫీసులో గ్రీవెన్స్‌సెల్‌లో దరఖాస్తు ఇచ్చినాడు తను. ఆయన ఎగాదిగా చూసి వివరాలు అడిగి తెలుసుకున్నాడు.

'ముందు పోలీస్టేషన్‌కు పోయి రిపోర్టిచ్చి, పోయింది నిజమేనని ఒక సర్టిఫికెట్ తెచ్చుకోపో' అన్నాడు నిర్లక్ష్యంగా.

తానిచ్చిన అర్జీ తన కళ్ళ ముందే చేత్తో నలిపి, ఉండచేసి అక్కడే ఉన్న చెత్త బుట్టలోకి విసిరేసినాడు.

రెండ్రోజులుగా తాను పడ్డ శ్రమంతా, తన కళ్ళముందే చెత్తబుట్టకు చేరితే చేసేదిలేక నిట్టూరుస్తూ బయటకొచ్చాడు దాదేసాబ్.

మరుసటి రోజు పోలీస్ స్టేషన్‌కు పోతే, 'ఎస్సై సాబ్ లేడు. రేపు రాపో' అన్నాడు సెంట్రీ.

ఎస్సై ఉంటే హెడ్ కానిస్టేబుల్ ఉండడు. హెడ్ కానిస్టేబుల్ ఉంటే ఎస్సై ఉండడు. ఇద్దరూ ఉన్నరోజు 'ఖూనీ కేసు విచారణ జరుగుతూ ఉంది. ఎస్సై ఎవర్నీ లోనికి పంపొద్దన్నాడని' బయటనే నిలబెట్టాడు సెంట్రీ.

దొంగతనం కేసనీ, యాక్సిడెంట్ కేసనీ రోజూ ఇదే తంతు. ఒకరోజు స్టేషన్ యెదురుగా వయసు మళ్ళిన కానిస్టేబుల్ కనపడి, 'రోజూ ఇట్లా ఎన్ని రోజులని తిరుగుతావ్. పైసల్లేకుండా ఇక్కడ ఏ పనీ జరగదు. ఏదన్నా లోపల ముట్టజెప్పు అన్నాడు.

'లెక్కలేదయ్యా, పేదవాడిని' అని దీనంగా తన గోడు చెప్పుకోబోయాడు దాదేసాబ్. 'నీ ఖర్మ, పో!' అంటూ నుదురు కొట్టుకుంటూ వెళ్ళిపోయాడు ఆ కానిస్టేబుల్.

అదనీ ఇదనీ పది రోజులు గడిచిపోయింది. తన అదృష్టం బాగుండి, ఒకరోజు ఎస్సై దర్శనం దొరికింది. తన గోడంతా వెళ్ళబోసుకున్నాడు.

అయన అడ్డమైన ప్రశ్నల్నీ అడిగి, నింపాదిగా 'ఏదన్నా పత్రికకు, నీ పాసుబుక్కు పోయిందని ప్రకటన ఇచ్చి, పది పన్నెండు రోజుల తర్వాత ఆ ప్రకటన కాగితం తీసుకుని రాపో!' అన్నాడు.

వాళ్ళనూ వీళ్ళనూ అడిగి తెలుసుకుని ఒక విలేకరిని పట్టుకున్నాడు దాదేసాబ్. 'వీఆర్వోను అడిగి పాస్‌బుక్ నంబరు తీసుకురాపో ప్రకటన వేద్దాం' అన్నాడు విలేకరి. వీఆర్వోను బతిమాలి ఐదువందలు ముట్టజెప్పి తన పాసుబుక్కు నంబరు, వివరాలు రాయించుకున్నాడు తను.

పత్రికలో వేయించుకున్న ఆ ప్రకటన కాగితం పట్టుకుని పోలీస్‌స్టేషన్ చుట్టూ నెలన్నర ప్రదక్షిణ చేస్తే, తన పాస్‌బుక్ పోయిందనే మాట నిజమేననే కాగితం తన చేతికొచ్చింది.

ఆఘమేఘాల మింద ఆరోజే ఎమ్మార్వో ఆఫీస్‌కు చేరుకున్నాడు. తను తెచ్చిన సర్టిఫికెట్ అటు ఇటూ తిప్పి చూస్తూ, 'ఇంతకు ముందు ఏ బ్యాంకులో కూడా లోన్ తీసుకోలేదా' అన్నాడు ఎమ్మార్వో సందేహంగా చూస్తూ.

'లేదు సామీ, ఈసారి క్రాపు లోన్ తీసుకుందామని తిరుగుతా వుండ, కేసీ కెనాల్‌కు నీళ్ళొస్తే నారు పోయాల, అందుకని మీరు దయపెడితే...'

'ఇంతకు ముందు ఏ బ్యాంకులో లోన్ తీసుకోలేదని ఏం నమ్మకమయ్యా? నీ పాసుబుక్కులు తాకట్టుపెట్టి ఏ బ్యాంకులోనైనా లోన్ తీసుకున్నావేమో! అన్ని బ్యాంకుల దగ్గరికి పోయి, బాకీ లేదని సంతకాలు పెట్టించుకుని రాపో!' అన్నాడు ఎమ్మార్వో సర్టిఫికెట్ టేబుల్ సొరుగులో పెట్టుకుంటూ.

దాదేసాబ్ గుండెలమీద గుండు పడ్డట్లయింది. ఏదో చెప్పబోయాడు.

'నేను చెప్పింది చేయ్. నీతో ఒక్కనితోనే మాట్లాడ్తా కూర్చుంటే, మిగతా వాళ్లుండారు కదా, పో!' అని గద్దించాడు ఎమ్మార్వో.

కాలికి బలపాలు కట్టుకుని, మండలం లోని అన్ని

బ్యాంకుల చుట్టూ ఒకటికి రెండుసార్లు తిరిగి 'నోడ్యూస్' సర్టిఫికెట్ తేవడానికి ఇంచుమించు నెలరోజులు పట్టింది తనకు.

తన పని అయిపోయినట్లు సంబరపడుతూ ఎమ్మార్వో ఆఫీసుకు చేరినాడు. వెంకటేశ్వరస్వామి దర్శనానికి నిలబడినట్లు క్యూలో నిలబడి, తన వంతు వచ్చేదాకా ఎదురుచూసినాడు. ఎమ్మార్వో యెదుటకు చేరుకోగానే, తను సాధించిన ఘనకార్యాన్ని ముడుపుకట్టినట్లు ఎమ్మార్వో చేతి కందించాడు.

ఎమ్మార్వో ఆ 'నోడ్యూస్ సర్టిఫికెట్'ను అటు ఇటూ తిప్పిచూసి, 'పోయింది పాత పాస్‌బుక్ కదా!' అని తల పంకిస్తూ 'తర్వాత ఏం జరిగినా నాదే బాధ్యత అని ఒక అఫిడవిట్ తీసుకు రాపో!' అన్నాడు.

'అదెక్కడిస్తారు సార్?' అడిగినాడు తను అయోమయంగా.

ఎమ్మార్వో విసుక్కుంటూ 'వీఆర్వోను అడుగు పోయ్యా! అన్నీ చెప్తాడు' అన్నాడు.

దాదేసాబ్ లోలోపల ఉడికి పోయినాడు. పేదవాని కోపం పెదవికి చేటనుకుని తమాయించుకున్నాడు. మారు మాట్లడకుండా బయటపడ్డాడు.

వీఆర్వో చెప్పినట్లుగా, మరి మూడు రోజులు 'నోటరీ' కోసం తిరిగి, అతనికి సమర్పించాల్సినది సమర్పించుకుని 'అఫిడవిట్' కూడా సాధించుకున్నాడు.

ఆ కాగితాన్ని ఇచ్చేందుకు ఎమ్మార్వో ఆఫీసుకు పోయి, ఆయన లేకపోవడంతో సాయంత్రం వరకూ పడిగాపులు కాసినాడు.

చివరకు 'తనకిచ్చి పొమ్మ'ని వీఆర్వో చెప్పడంతో, దాన్ని వీఆర్వోకిచ్చినాడు. రెండ్రోజుల తర్వాత ఎమ్మార్వో ఉంటాడు, అప్పుడు రమ్మంటే, తలవూపి వచ్చేశాడు.

ఈ ఆరునెళ్ళ కాలంలో ఆఫీసుల చుట్టూ, బ్యాంకులచుట్టూ తిరుగుతూ దాదేసాబ్ మద్దేన్నం పూటల పిడస తినింది లేదు. ఎక్కడో చోట నాలుగు లోటాలు మంచి నీళ్ళు తాగడమో, ఒక్కోసారి రెండు మిరపకాయ బజ్జీలు తినో కడుపు పూడ్చుకుని, మాపటికి ఇల్లు చేరడం పరిపాటి అయింది.

ఇంక ఈరోజు పని అయిపోతుందని భార్యతో చెప్పి, ఎమ్మార్వో కాడికి పోతే, ఇప్పుడు మళ్ళీ ఇంకేదో తెమ్మంటున్నాడు.

అదేదో 'ఇండెమ్నిటీ బాండ్" అంట. ఎమ్మార్వో చెబితే తనకు అర్థం కాలేదు. వీఆర్వోను అడిగితే 'అదేదో పూచీకత్తు' అన్నాడు. అప్పటికీ తనకేమీ అర్థం కాలేదు. కడుపులో పేగులు మెలి తిరుగుతుంటే కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరాడు.

* * *

ఎంత కళ్ళు మూసుకున్నా దాదేసాబ్‌కు కళ్ళమీదికి నిద్రరావడం లేదు. ఆలోచనలు వీడడం లేదు.

'అదికావాల ఇదికావాల'ని వీళ్ళు ఆఫీసు చుట్టూ తిప్పుకుంటూండేది డబ్బుకోసమేనని దాదేసాబ్‌కు అర్థమౌతోంది. 'పాపిష్టి డబ్బు తన దగ్గరుంటే ఇన్ని అవస్థలు పడాల్సిన ఖర్మేందుకు?' అనుకున్నాడు.

ఊర్లో ఎవర్ని అప్పు అడిగినా, రెడ్డికాడికి పోదాంరా ఇప్పిస్తామంటారు. పొరబాటున ఆడ బాకీ పడితే, ఆయప్ప వాపసు తీసుకోడు. అక్కరున్నప్పుడంతా అంతో, ఇంతో ముట్టజెప్పి ఉన్న రొంత భూమి మింగుతాడు. నోటికాడ కూడు బోతాది. అడకత్తెరలో పోక చెక్క మాదిరయిందనుకున్నాడు తన బతుకు.

ఈ పానుబుక్కు కోసం తిరగడంలో నెలరోజుల నుంచీ తనకు ఆరోగ్యం బాగా దెబ్బతినింది. ఆర్‌ఎంపీ డాక్టరు వినాయక్‌కు చూపిస్తే 'బిపీ బాగా ఎక్కువుంద'న్నాడు. జాగర్తలు చెప్పినాడు.

'తనకేమన్నా అయితే భార్యాబిడ్డల గతి ఏం కావాల? తాను తప్ప దిక్కులేరు' – ఆ మాట మనసులో మెదలగానే కళ్ళ నిండా నీళ్ళు నిండాయి. అతికష్టం మింద ఏడుపు దిగమింగి భార్యాబిడ్డలు పడుకున్న వైపు చూసినాడు. చీకట్లో వాళ్ళ మొహాలు కనిపించలేదు.

ఆలోచనల సుడిగుండాల్లో కొటుకులాడుతున్నాడు దాదేసాబ్.

* * *

తెల్లవారగానే ఊరంతా గుప్పుమనింది – 'దాదేసాబ్ నిద్రలోనే పోయా'డని. దాదేసాబ్ ఇంటిచుట్టూ ఊరి జనం మూగారు.

దాదేసాబ్ మీదపడి గుక్కపట్టి ఏడుస్తున్న మాలంబి కాడికొచ్చి అన్నారెవరో మెల్లగా, గుసగుసగా – 'ఖుద్‌ఖుషీ' చేసుకున్నాడని చెపుదాం. సర్కారు నుంచి డబ్బొస్తుంది.'

ఆ మాట విన్న మాలంబి దిగ్గున తలెత్తి, జారిపోయిన కొప్పు ముడేసుకుంటూ – 'నా మొగుడు ఖుద్‌ఖుషీ చేసుకోలే. సర్కారోళ్ళు ఖూనీ చేసినారు... ఖూనీ చేసినారు' అంటా మొగుని మింద పడి గుండెలవిసేలా ఏడుస్తూనే ఉంది.



## చెప్పాలనుకున్నది

◆డా॥ సి. నారాయణరెడ్డి

నేను చెప్పాలనుకున్నది
నా నోటితో చెప్పకముందే
ఆకాశం చెప్పింది మేఘభాషలో.
అది గమనించిన సముద్రం
దానితో తనగొంతు కలిపింది
తరంగభాషలో.
తనతోపాటున్న అంబరం
తనకిందున్న సాగరం
తమతమ భాషల్లో పలుకుతుంటే
ఉత్తేజం ఉబికి
భాస్కరబింబం పలికింది కిరణభాషలో.
ఈ భాషా వైఖరులను
చెవులారా పరిశీలిస్తున్న ధరామండలం
తన గళం విప్పింది
హరిత హరిత తరుభాషల్లో.
ఇన్ని అపూర్వ భాషలు విని



నన్ను నేను అడిగి చూసుకున్నాను.
ఇంతకూ
నేను చెప్పాలనుకున్నదేమిటని?
ఏదైతే ఏమిటి?
చెప్పాలనుకున్న అభిమతం
ఇన్ని వినూతన భాషల అవతరణకు
పాదులు వేసింది.
ఇంతకంటే నా ఆకాంక్షకు
సఫలత ఏముంటుంది?
ఇకముందు
చెప్పాలనుకున్నదేదైనా
అనూహ్య ఫలితాలకు
దారితీస్తుందని
ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను.
ఇంతటితో
ఈ కవితా ప్రసారానికి
స్వల్ప విరామం.



## వేదమిత్రా నీవు ఓడిపోలేదు

◆సునీత ఆరిమిల్లి

ఓ వీర జవాను వేదమిత్రా
నీకు... వేల వేల జోహార్లు
దేశ సరిహద్దుల్లో
ఎండనక... వాననక..
మంచు ప్రదేశాల్లో సైతం
రక్షణ కోసం నిలిచావు
యుద్ధాల్లో శత్రువుల్ని తుదముట్టించావ్
వీరోచితంగా పోరాడి గెలిచావు
దేశంలో అడుగు పెడుతూనే ఓడిపోయావా!
ఓ అబలను కాపాడి
మరణాన్ని ముద్దాడావా ఓ వేదమిత్రా!

మహిళలను వెంటాడుతూ
మగ క్రూర మృగాలు
దేశం నిండా విహరిస్తున్నాయ్
కీచకుల పర్వంలో
పసిపిల్ల మొదలుకుని...



పండు ముసలివరకు
మహిళలపై అకృత్యాలకు అంతేలేదు
నీ సాహసం అపూర్వం వేదమిత్రా!

నీవేమీ ఓడిపోలేదు వేదమిత్రా!
మహిళల మాన ప్రాణాలకు
రక్షణ ఇవ్వలేని వ్యవస్థను సృష్టించిన
పాలకులను నీ మరణం నిలదీయాలి
సరిహద్దుల్లోనే కాదు
గల్లీ నుంచి ఢిల్లీ దాకా గస్తీ కాయాలని
దేశంలోపల కూడా యుద్ధం చేయాలని
నీ మరణం తెలియజెప్పాలి

వేదమిత్రా నీ మరణం గెలవాలి
నీ త్యాగంతో
ప్రతి స్త్రీ ఒక జవానుగా మారి
నీ మరణాన్ని గెలిపించాలి.
దానికి నువ్వే స్ఫూర్తి కావాలి!

(ఇటీవల ఉత్తర ప్రదేశ్ మీరట్‌లో వేదమిత్ర అనే ఓ ఆర్మీ జవాను ఓ బాలికను కొందరి పోకిరీల బారి నుండి కాపాడి తన ప్రాణాలను అర్పించారు.)



# సమతావాది జాషువా

• రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి
9440222117



*కొడవటి టెక్కమున్ తలను గూరిచి, కార్మిక కర్షకాళితో*
*నడుము బిగించె నీయుగము నందొక నూతన సామ్యవాద మ*
*నడిబడి దాని దెబ్బకు వికావికలైనది స్వార్థ జర్మనీ*
*జడనిధి నేటి మారుపు లసంఖ్యములంచిత ముల్ విచిత్రముల్"*
**- (కాందిశీకుడు, 1943)**

నాస్తికుల సామ్యవాదుల
మస్తిష్కమునందు పతితమానవతతికిన్
గాస్త జగా కలదేమో
నాస్తిసుమీ కరుణ కీదినాలం గృతులన్.
**-(కొత్తలోకము, 1957)**

ఒకటిన్నర దశాబ్ది కాలంలో వామపక్షం పట్ల జాషువాకు గౌరవం పెరగడాన్ని ఈ రెండు పద్యాలు రుజువు చేస్తున్నాయి. జాషువా ప్రాథమికంగా గాంధేయవాది. ఆయన కావ్యాలనిండా గాంధీని స్తుతించినంతగా ఇంకే నాయకుని స్తుతించలేదు. సగరామాంథాతాది చక్రవర్తుల నుండి ఇందిరాగాంధి దాకా ఆయన అనేక మంది చక్రవర్తులను, రాజులను, రచయితలను, నాయకులను కీర్తించారు. అందులో గాంధీకే అగ్రాసనం. 1952లో ప్రారంభించిన 'కొత్తలోకము'లో "మహాత్ముని చెప్పుల జోడులోన కాలాడాచరించెదన్" అని ప్రకటించుకున్నాడు. గబ్బిలం నుండి కొత్తలోకము దాకా ఆయన గాంధీజీని నోరారా కీర్తించారు. గాంధీజీ ప్రబోధించిన శాంతి, అహింస సిద్ధాంతాల ప్రభావం జాషువా పైన బాగా పడింది.

అయితే జాషువా కవిత్వాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేస్తే ఆయన మార్క్సిజాన్ని గుర్తించి, ఆమోదించకపోయినా ఆయన కోరుకున్న సామాజిక పరివర్తన అంతా మార్క్సిజం చెప్పిన దానికి దగ్గరగా ఉంటుంది. జాషువా మార్క్సిజం చెప్పే అంతర్జాతీయ సమాజాన్నే కోరుకున్నాడు.

"కోటానుకోట్ల నరులొక మేటి జగన్మాతృ సుతులు మిత్రులని మదిం
చాటింపు మీ సువార్తన్ జాటింపుమ జీవితంబు సార్థక్యమగున్"

ఇదీ ఆయన సందేశం. మాది 'కలికి తెలుగు కులము' అని చెప్పుకున్న జాషువా 'విశ్వనరుడ నేను' అని కూడా చెప్పుకున్నాడు. 'విశ్వైక్యత విశ్వసోదరత విశ్వప్రాజ్య జాతీయతల్ వెలయంగావలె' నని కోరుకున్నాడు. యుద్ధాన్ని వ్యతిరేకించి విశ్వశాంతిని ఆకాంక్షించాడు. అంతర్జాతీయ దృష్టిని ప్రదర్శించడం మార్క్సిజం నేర్పినదే.

శ్రమదోపిడికి వ్యతిరేకంగా పోరాడటం మార్క్సిజం నేర్పినదే. అనేకులు శ్రమించిన ఉత్పత్తిని, దానితో సంబంధంలేని కొందరు దిగమింగడం అన్యాయమని నినదించింది మార్క్సిజం. జాషువా తన కావ్యాలలో శ్రమదోపిడిని తీవ్రంగా గర్హించాడు, విమర్శించాడు. "పేదటికము పెద్ద వింతశాల" అని 1932నాటికే ప్రకటించాడు జాషువా. అంతేకాదు "*ఎవడారగించు అమృత భోజనంబున కలిసెన్/*

*ఈ లేమ గంజి బువ్వ*" అని కూడా ఆయన ఆనాడే ప్రశ్నించాడు 'స్వప్నకథ'లో. 'ఫిరదౌసి' కావ్యం లో సుల్తాను దోపిడీనే ఆయన చిత్రించింది. పంచభూతాత్మకమైన ప్రకృతి సుఖాన్ని అనుభవించే హక్కు మనిషికే కాదు, అతిచిన్న ప్రాణికీ

ఉన్నదని భావించిన జాషువా, మనుషులలోనే దోపిడీ ఉండటాన్ని సహించలేకపోయాడు.

శ్రమదోపిడీ కోసం భారతదేశంలో సృష్టింపబడిన కర్మసిద్ధాంతాన్ని జాషువా గట్టిగా నిలదీసాడు. "స్వార్థలోలురు, నా భుక్తి ననుభవింత్రు" అని స్పష్టంగా పేర్కొన్నాడు, 'గబ్బిలం' లోనే. అంతేకాదు మతం సంపన్నుల దోపిడీకి ఉపయోగపడుతుందని కూడా ఆయన నిస్సంకోచంగా ప్రకటించాడు. 'ధనవంతుల మేలుకే మంత్రతంత్రముల్' (కొత్తలోకం). జాషువా 1932లోనే 'అనాథ కావ్యంలో' "సుఖమొక్కచోట, గడగండ్లొకచోట గదా వసుంధరన్" అని గుర్తించి, 'స్వప్న కథ' లో ధనిక పేద వర్గ విభజనను ప్రకటించాడు.

కాని ఆయన మరో పదేళ్ళకే భావవాదం నుంచి వైదొలగకపోయినా, మతాన్ని, దాన్ని ఆవరించిన సిద్ధాంతాలను విమర్శనాత్మకంగా చూడడం ప్రారంభించాడు. కర్మ సిద్ధాంతాన్ని నిలదీశాడు.

గబ్బిలంలోనే దళిత స్పృహతో జాషువా దళితులు శ్రమ చేస్తే 'ఫలితమెల్ల నొరులు భాగించుకొని పోవు నీచమైన భూమి జూచినావె' అని అరుంధతీ తనయునితో పలికించాడు. ఇంకా ఏమన్నాడో చూడండి.

"ధనికుల్ సోమరిపోతులై కటిక పేదల్నెత్తురుల్ పిండి కూ
ర్చిన విత్తంబును వెచ్చబెట్టి ధరణిన్ జీర్ణించియున్నటి రా
మునకో రంగనికో నిఖాలవసరంబుల్ సలుపుచున్నారు"

అని అధిక్షేపించాడు. శ్రమ, ఫలానుభవం అందరిదీ కావాలన్నది మార్క్సిజం. జాషువా దానినే చెప్పాడు.

"ధనము ధాన్యము నొకని పెత్తనము క్రింద
కట్టువడి వ్యర్థముగా తుప్పుపట్టరాదు"

అని 'కాందిశీకులు' లో ప్రకటించాడు. ఎర్రకండువా కప్పుకోకపోయినా మార్క్సిస్టు మాటలే జాషువా పలికాడు.

మార్క్సిజం సామాజిక మార్పునకు సంబంధించిన వాదం. అది భౌతికవాదం. మార్క్సిజం మనిషిని వాస్తవంగా గుర్తుస్తుంది. మానవాతీత శక్తిని నిరాకరిస్తుంది. భావవాదం శ్రామికుల శత్రువుగా గుర్తిస్తుంది. మతాన్ని దోపిడీ వ్యవస్థగా పరిగణిస్తుంది. మతం మత్తుమందు అన్నది మార్క్సిస్టు నినాదం. జాషువా 1932 నాటికి మంచి ఆస్తికుడుగా ఉన్నాడు. 1940 ల నాటికి సంశయవాదిగా మారాడు. ఆ తరువాత చాలాకాలం అలాగే కొనసాగాడు. జీవితావసానంలో నాస్తికుడిగా మారాడని లవణం ఒకసారి సదస్సులో కలిసినప్పుడు చెప్పారు.

'స్వప్నకథ' లో నాస్తికులను నిలదీశాడు జాషువా. కిందపడ్డ చిన్న బిడ్డకు దెబ్బ తగలకపోవడం ఏదో మహాశక్తి రక్షించిందని అన్నాడు. అలాగే 'అనాథ' కావ్యంలో

"పరుల దుర్గతిగని గుండెగరిగి వగచు/సదయా హృదయుల వీక్షణాంచలమునందు
బుట్టుచుండును కన్నీటిబొట్టువోలె /
ఏది భగవంతుడని సంశయింతువేల"

అనే దశలో ఉన్నాడు జాషువా. కాని ఆయన మరో పదేళ్ళకే భావవాదం నుంచి వైదొలగకపోయినా, మతాన్ని, దాన్ని ఆవరించిన సిద్ధాంతాలను విమర్శనాత్మకంగా చూడడం ప్రారంభించాడు. కర్మసిద్ధాంతాన్ని నిలదీశాడు. విగ్రహాలకు పెళ్ళిళ్ల చేయడాన్ని అధిక్షేపించాడు. మనిషిని నిరాదరించి విగ్రహాలను పూజించడాన్ని వ్యతిరేకించాడు. వాళ్ళను 'వక్రచరితులు' అన్నాడు. వేషధారులను ఎద్దేవా చేశాడు. అసలు భగవంతుడనే "ఎవరడిగినారు నిన్నీ అవకతవక సృష్టి చేయమని" అని అడిగాడు. అవతార భావనను విమర్శించాడు. స్వర్గ నరకాలను మానవుడే సృష్టించాడన్నాడు.

మార్క్సిజం సాంఘిక వివక్షను, లింగ వివక్షను, ఆర్థిక అసమానత్వాన్ని, అవినీతిని, ఆడంబరాలను, దోపిడీని ఆమోదించదు. వాటికి వ్యతిరేకంగా ఉద్యమిస్తుంది. ఎంతో మంది మార్క్సిస్టులు కులాంతర, మతాంతర వివాహాలు చేసుకున్నారు. చేశారు. నిరాడంబరంగా బ్రతికారు. అవినీతిని శత్రువుగా చూశారు. జాషువా తన రచనలనంతటా కులవివక్షను, కులపీడనను నిరసించాడు. దళితుల శ్రమశక్తిని కీర్తించాడు. భారతదేశానికి కడగొట్టు బిడ్డడని దళితున్ని పేర్కొన్నాడు. బ్రహ్మశరీరావయవాల నుంచి నాలుగు వర్ణాలు వస్తే ఐదవ వాడు దళితుడు ఎక్కడినుంచి వచ్చాడని ప్రశ్నించాడు. ముంటాజమహలులో దళితున్ని గొప్ప సౌందర్యపిపాసిగా చిత్రించాడు. 'మరియాదాల కాస్పదములేని యభిదలతో" మాలమాదిగలని దళితులను సంభోదించడాన్ని వ్యతిరేకించాడు. ఛండాలత్వం గుండెలను తినివేస్తున్నదని బాధపడ్డాడు. కళలు కులీనులనే కాదు, కులం లేదనే వాళ్ళను కూడా మోహిస్తాయి, అవకాశం ఇస్తే అని చాటాడు. దళిత ఆత్మగౌరవానికి, దళిత ప్రతిఘటనకు ప్రతీక జాషువా.

# వాన



◆ తప్పట ఓదయ్య
9441641702

వాన
నల్లమబ్బు చీల్చుకొని
చిటపట చినుకులై
చిన్న చిన్న కాలువలై
వాగులు వంకలై- సెలయేర్లుగా,
నదులుగా... నిండుగా
హోరుగాలితో జోరుగా
వెల్లువగా...
ఎండిన నేలను తడుపుతూ
అంకురాలను ముద్దాడుతూ
లే కొమ్మలను తాకుతూ
మూగజీవాలకు జీవధారగా
మలినాలను తొలగిస్తూ
పల్లె తనువంతా తడుముతూ
వాన.. ఉప్పెనలా
కడలితరంగంలా
ఎండకు కండ్లు బైర్లుకమ్మి గిర్రున
దిరిగిపడినప్పుడు...
మిరిమిట్లు గొల్పెకాంతులే....
తళతళ మెరుపులుగా,
ఆకలితో అరిసే పేగులకేకల
నిట్టుర్పులే... పెళపెళ
ఉరుములుగా,
కంటిరెప్పల కారుమబ్బులను
చీల్చుకొని
కనుకొలనుల సుడిగుండాల నుండి
జలజల రాలుతున్న... కన్నీటిధార
భూతల్లి పన్నీరులద్దుతున్న....
కష్టజీవి నెత్తుటిధార... వాన
టపటప రాలే చినుకులై
వాగులు వంకలై నదులుగా...
నదుస్తూ...
మట్టిని తడుపుతూ
మొక్కలకు ఊపిరిలూదుతూ
అణువణువును ఆలింగనం చేస్తూ
సుతారంగా తాకుతూ...
ఎదలోయల్లోనుండి,
ఉబుగుతూ.. పల్లె తనువును
సింగారిస్తూ
చెమటచుక్కల సుమగంధాలు
ఎద కురిపిస్తూ...
కదలి తరంగములా కన్నీటిధార ...
ఈ వాన



---

పురుష భూతాలు భార్యలను పిప్పి చేయడాన్ని ప్రస్తావిస్తూ, మగవాళ్ళను ఆడవాళ్ళుగా పుట్టించి వాళ్ళ బాధలు ఎలా వుంటాయో అనుభవంలోకి తేవాలన్నాడు. ఆడతెగ లేకుంటే మగతెగకు పుట్టగతులే లేవు అని ప్రకటించాడు. వ్రతాలు, నోములు స్త్రీలను మోసం చేయడానికే సృష్టింపబడ్డాయని పేర్కొన్నాడు. అబల అనే పేరుతో స్త్రీల శక్తుల్ని చిదిమేసిన వ్యవస్థ మీద తిరుగుబాటు చేసి సబల అని రుజువు చేసుకోమని ప్రబోధించాడు.

సొంత ఆస్తిని వ్యతిరేకించే మార్క్సిజం సొంత ఆస్తుల వ్యవస్థలో శ్రమదోపిడీని, ఆర్థిక అవినీతిని శత్రువులుగా చూస్తుంది. వాటికి వ్యతిరేకంగా పోరాడుతుంది. దొడ్డ పదవులెక్కి గడ్డిమేసే రాజకీయ నాయకులను జాషువా అసహ్యించుకున్నాడు. ఎన్నికల రాజకీయాలలో “మోటారు బండ్లపై నగదు మూటలతో కలవాడి యోటు భిక్షాటన సాగుచున్నయది” అన్నమాట 2014 ఎన్నికల సమయంలో చెప్పినట్లున్నది. ప్రజాస్వామ్యమైన రాజకీయాలను కోరుకున్న జాషువా ఇవాళ వుంటే కొనుగోలు రాజకీయాల మీద ఉమ్మేసేవాడు.

జాషువా భారతీయ సమాజాన్ని, సాహిత్యాన్ని ప్రజాస్వామికం చేయడానికి కృషి చేశాడు. మానవీయ సమాజం ఆయన కల. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే మూడు సూత్రాల మీద ప్రేమమయ సమాజ నిర్మాణం ఆయన ఆకాంక్ష. ఈ ఆకాంక్షను వ్యక్తం చేయడానికి కవిత్వాన్ని సాధనంగా వాడుకున్నాడు. తెలుగు కవిగా, ఆధునిక కవిగా సమకాలీన భారతీయ సామాజికి వాస్తవికతనే వస్తువుగా స్వీకరించాడు. భారతదేశ చరిత్రను గౌరవిస్తూనే దేశం మారవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాడు. మళ్ళీ సంస్కృత గ్రంథాలను అనువదించకుండా, వాటిని సంస్కృత సమాసాలతో ముంచెత్తకుండా కవిత్వాన్ని సమకాలికం చేశాడు. ఏదీ చెప్పినా పద్యంలోనే చెప్పాడు. పద్యాన్ని సరళీకరించాడు జాషువా. పద్యాన్ని సామాన్యుల దగ్గరికి తీసుకుపోవడానికి కృషి చేశాడు. పద్యాన్ని కూడా ప్రజాస్వామీకరించాడు. ఆయన పద్యం సరళమూ, సుందరమూ. తేట తేట మాటలతో, మార్దవం తొణికిసలాడే పదాలతో, ముద్దుగొలిపే వాక్యాలతో సకల భావాలను వ్యక్తం చేశాడు.

జాషువా మార్క్సిస్టునని చెప్పుకోకపోయినా అభ్యుదయ సాహిత్యయుగ నేపథ్యంలోనే తన కృషినంతా సాగించాడు. ఆ లక్షణాలు ఆయన కవిత్వంలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.






# ఆచార్య ఇనాక్ సాహిత్యం సమకాలీన జీవిత నేపథ్యం

• ఆచార్య కొలకలూరి మధుజ్యోతి
944193172

ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యానికి ఇది షష్ట్యబ్ది. అరవైయేళ్ళ సాహిత్య సృజనలో నేల విడిచి సాము చేయటం కొలకలూరి కలానికి తెలియదు. కవిత్వం కథానిక నవల నాటక నాటిక రచనలలో తోటి మానవుడికి దిక్సూచి కాని, ప్రేరణ ఇవ్వని, చైతన్యం కలిగించని, ఆవేశం రగిలించని, ఆవేదన పొంగించని, ఆలోచన రేకెత్తించని రచన లేదంటే అతిశయోక్తి కాదు. ఇనాక్ గారికి సమాజం ముడిసరుకు. దాని నుంచి వస్తువును ఎంచుకొని, తీర్చి దిద్ది నగిషీ చెక్కి పదునైన ఆయుధంగా సమాజంపైకే సంధించారు. ఆ ఆయుధం కొందరి అజ్ఞానాన్ని తునుమాడితే, కొందరి అహంకారాలను నిలదీస్తే, కొందరి పెద్దరికాన్ని కూలదోస్తే, కొందరి చైతన్యానికి పదునుపెడితే కొందరి ఆలోచనా దిశను తీర్చిదిద్దితే, సమాజం దానిని అనేక బాహువులతో ఆలింగనం చేసుకొంది.

ఇనాక్ తొలి రచన 'ఉత్తరం' (1954) .నేడు అది లభ్యం కాదు. కాని, అందులోని సారాంశం కథకుడిని బట్టి, ఊరి కామందు చేతిలో దెబ్బలు తిని మరణించిన తాతను గురించి చదువుకొంటున్న కుర్రాడికి ఉత్తరం రావటం. 'పొన్నుకర్ర పెత్తనం ఊరి పొలిమేరలు దాటాలి' అని భావించిన కుర్రాడి కథ. పదిహేనేళ్ళ ప్రాయంలో కలం పట్టిన కుర్రాడు, వెన్నెల రాత్రినో, ఎగిరే ముంగురులనో, గలగల సాగే అమ్మాయిలనో కాక, ఎంచుకొన్న వస్తువును చూస్తే, నాటికే రచయితకు ఉన్న చేతన తెలుస్తుంది. యవ్వనం ఆకర్షించే విషయాల పట్ల కాక, అమానుషం పట్ల ఎద చెదరటం కుర్రాడు మొగ్గ చూపటం రచయిత చేతనే. వాస్తవాల కాఠిన్యానికి కరిగిన గుండె, అవే విషయాలను తన సాహిత్య వస్తువులుగా తీసుకొంది.

దళితుల మీద దురాగతాలు ఈనాటివి కావు, అవి ఆగటం లేదు. దళితుడిని దళితులను హననం చేయటానికి సభ్యసమాజానికి ప్రత్యేక కారణాలు ఏవీ అక్కర లేదు. కంచికచెర్లలో కోటేశును సజీవ దహనం చేసిన హృదయ విదారక ఘట్టం సమాజం విస్మరించినా, దళిత సమాజం ఆ గాయపు పచ్చిదనాన్ని నేటికి అనుభవిస్తూ ఉంది. ఈ 'దిక్కులేనోడు' (1978) నాటిక కోటేశు ఇతివృత్తం ప్రధానంగా సాగిన రచన. అన్యాయంగా ఒక యువకుడి ప్రాణాలను బలిగొన్న సమాజం తన న్యూన బుద్ధిని చాటింది. జరిగిన వాస్తవాన్ని చిత్రించినా, ఆ క్రమంలో సమాజం ఎలా, ఎంత లౌక్యంగా తమ అరాచకాన్ని అమలు చేస్తుందో తెల్పి చైతన్య పరిచారు.

అందులోనే కాదు, అంతకు పూర్వమే 1969లో వచ్చిన

'ఊరబావి' కథ కూడా దళిత సంబంధమే. సహజ వనరు అయిన నీటికి దూరం చేయబడి, నీటికై సమాజాన్ని నిత్యం యాచించే స్థితి దళిత సమాజానిది. ఒక ఎద్దు దట్టెం ఊరబావిలో పడి, అది తీసే మాదిగ వ్యక్తి లేక, నీరు వాడలేక, బావిని మాదిగలకు వదిలేసింది ఊరు ఈ కథలో. సమాజంలో నెలకొని ఉన్న వాస్తవ అవమానకర స్థితిని చిత్రిస్తూనే, తమ ఆత్మాభిమానాన్ని, గౌరవాన్ని, అస్తిత్వాన్ని నిలుపుకోవాలనే సూచన కథాప్రణాళికలో భాగం చేశారు అచార్య ఇనాక్. 'వస్తువురీత్యా, సంస్కృతిరీత్యా స్వాతంత్ర్యా నంతరం వచ్చిన ఆధునిక తొలి కథ' అని బిఎస్ రాములు (సమగ్ర సామాజిక కథ, తాత్త్విక భూమిక) 'తొలి దళిత స్త్రీవాద కథ' (ఆంధ్రజ్యోతి దినపత్రిక 26.05.14) అని భవ్యశ్రీ పేర్కొన్న ప్రసిద్ధ కథ. దళిత సాహిత్యం రూపు దిద్దుకోని కాలంలో దళిత చైతన్యంతో దళిత స్త్రీ చైతన్యంతో వచ్చిన కథ ఇది.


కొలకలూరి ఇనాక్

సమాజం దళితుల పట్ల అనుసరించే కుతంత్రాలకు బలయి పోకుండా జాగురూకులయి ఉండాలని హెచ్చరిస్తూ, వచ్చిన కథలు 'నల్లులు, గొడ్డదొంగ' వంటివి ఎన్నో.

స్త్రీ పట్ల ఇనాక్‌గారి దృష్టి చాలా ప్రత్యేకమయినది. స్త్రీని సున్నితంగా సుకుమారంగా అందంగా మల్లెపూవులా లేత తమపాకులా కీర్తించే రచయిత, స్త్రీని ఆత్మవిశ్వాసిగా, ధైర్యసాహసాలు కలదానిగా, కుంగిపోనిదానిగా, సమస్యను ఎదుర్కొనే చైతన్యరాశిగా ఆరాధించారు. ఇనాక్‌గారి రచనల్లోని ఈ లక్షణాల వల్లే, వారిని స్త్రీ పక్షపాతి అనటమూ ఉంది. స్త్రీవాదులు ఆశ్చర్యపోయేటంతటి అభ్యుదయాన్ని స్త్రీ విషయికంగా తన రచనలలో స్త్రీవాదం రాకపూర్వం, స్త్రీవాదం అంటే ఏమిటో కూడా ఆంధ్రదేశం ఊహించని కాలంలో నిల్పారు. అందుకు తార్కాణం వారి 'అనాథ, సౌభాగ్యవతి, సౌందర్యవతి, సమత, రెండుకళ్ళూ మూడు కాళ్ళు', నవలలు, 'మనలాంటి మనిషి' నాటకం. ఇవన్నీ 1960,1970 ప్రథమ భాగంలోని రచనలు.

సమకాలీన జీవితాన్ని చిత్రించిన కథలు వీరివి. సమాజంతో పెనవేసుకొన్న మూఢనమ్మకాలు ఎన్నో జీవితాలను నాశనం చేస్తాయి. నిర్దయగా పాశవికంగా ఒక స్త్రీని ఉన్మాదస్థితిలో సతి పేరిట భర్త చితిపైకి ఎక్కించి సజీవ దహనం చేసిన సంప్రదాయ మూర్ఖతకు అద్దం పట్టిన కథ 'ఏడీ సూర్యుడు' (సూర్యుడు తలెత్తాడు). ఇది రాజస్థాన్‌లో 'రూపకన్వర్' అనే స్త్రీని 1980లలో సతీసహగమనం చేయించిన వార్తకు చలించి చేసిన రచన.

సెంట్రల్ యూనివర్శిటీలో సునీత అనే దళిత యువతి ప్రేమ విఫలమై ఆత్మహత్య చేసుకొన్న సంఘటనకు రోదించిన కలం వెలువర్చిన కథ 'విపర్యయం' (అస్పృశ్యగంగ). ఈ కథలో ఆమె జీవించింది. ఆత్మహత్యకు పూనుకోలేదు. ధైర్యంగా నిలబడింది. ఇవి కథల రూపం దాల్చిన వాస్తవాలు. ఇనాక్‌గారు ఏ స్త్రీ ఓడిపోవటాన్ని అంగీకరించరు. మరణాన్ని అసలు ఒప్పుకోరు. పడినా లేచినా నిండు జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవించాలంటారు. ఈ రెండు కథల్లో ఆ పాత్ర చనిపోవటం వెనుక సమాజ క్రూరత్వం ఒక కథలో ఉంది. మరో కథలో ప్రేమకు లొంగిపోయే స్త్రీ మనస్సు, దాన్ని అవకాశంగా తీసుకొనే పురుషుడి చతురత, అందుకు వీలు కల్పించిన దళితుల పట్ల అలుసు సనీత దుర్గతికి కారణంగా ఉన్నాయి. ఈ వాస్తవ విషయాలను అర్థంగా చిత్రించిన ఇనాక్ స్త్రీ దృఢత్వాన్నీ చిత్రించారు.

స్త్రీ నిర్మలమైన అంతకరణాన్ని కాపట్యంతో పురుషుడు అవకాశంవాదంగా మలచుకొంటాడు. ఎగిరే తుమ్మెద కనిపించిన పువ్వులన్నింటికి ఆకర్షింపబడినట్లు పురుషుడు చంచలం కాకూడదు. అలా అయితే పరిస్థితి ఏమిటి? చదువు రాని నాగిరెడ్డి అక్క కూతురిని నాగమ్మను వివాహం చేసుకొన్నాడు. కాంట్రాక్టరు అయ్యాడు పట్నం చేరాడు. ఉద్యోగిని అయిన రమను ఇష్టపడ్డాడు. పిల్లల్లేరనే నెపంతో నాగమ్మను ఒప్పించి రమను వివాహం చేసుకొన్నాడు. భార్యలిద్దరూ తల్లులయ్యారు. కాని చదువు రాని ఉద్యోగం లేని నాగమ్మ భర్త ప్రవర్తనలోని వివక్షను గుర్తించింది. రమను అపురూపంగా తనను హేయంగా చూడటాన్ని గుర్తించింది. చదువుకొని ఉద్యోగం చేయాలని నిశ్చయించుకొని భర్తను కాదనుకొని వెళ్ళిపోయింది. స్త్రీకి స్త్రీ శత్రువు కాదు, వీరిద్దరూనూ స్నేహంగా ఉన్నారు. భర్త కపట ధోరణిని అర్థం చేసుకొని తన మార్గాన్ని స్పష్టం చేసుకొంది నాగమ్మ (గమ్యం–అస్పృశ్య గంగ).

ఈ సమాజ నిర్మాణంలో వివాహమై స్త్రీ భర్త ఇంటికి చేరుతుంది. ఇరవై ఏళ్ళ అనుబంధపు తీగలను లాగేసి, భర్తతో కుటుంబంతో ఆ అనుబంధపు తీగలు అల్లుకోవాలను కొంటుంది. ఒక్కతి పరాయి చోటు. కొత్తవారు. ప్రేమ ఉంటే బాగుంటుంది జీవితం. భర్త సరే! అతని ప్రేమా ఆనందమే. కాని వరకట్న ఆశ ఉన్న చోట? సంపన్నులయిన అత్తకి కట్నం కావలసిన చోట? దినదిన గండం నూరేళ్ళాయుష్షు. ఏ రోజు డబ్బు ఎంత తెమ్మంటారో! పేద తండ్రి, డబ్బు ఇవ్వలేకపోతే? వారికి మరో పెళ్ళి ఆశ. మరో వరకట్న మార్గం. దాని కోసం కోడలిని ఏం చేయాలి. ఎలా చంపాలి. బావ అత్తా కిరసనాయిల్ పోసి చంపదలిస్తే చనిపోవటమేనా? అత్త పుణ్యాన ఆదమరచి మత్తుగా నిద్రపోతున్న భర్త కాపాడలేకపోతే? ఇనాక్‌గారి స్త్రీ పాత్ర అలా చావదు. అడ్డుకొంటుంది. ఆ క్రమంలో ఆ కిరసనాయిల్ చింది అవతలి వారిపై పడేలా, అడ్డుకొంటుంది. దోపిడికి మరింత దోపిడికి అవతలి వారికి అవకాశం ఇవ్వదు. ఇదే విషయాన్ని చెబుతుంది 'డౌరీ డెత్' (అస్పృశ్యగంగ) కథ. ముగింపు జనం ఊహకే.

తల్లి వాస్తవం, తండ్రి నమ్మకం – ఏ పిల్లలకు అయిన. తల్లి ఎవరిని చెప్తే వారే తండ్రిగా చలామణి అవుతారు. కాని చట్టం వాస్తవమయిన తల్లిని కాక నమ్మకం అయిన తండ్రిని పితృస్వామ్య వ్యవస్థ బాసటగా అధికారికంగా పేర్కొంటుంది. ఈ విధానాన్ని ప్రశ్నించిన కథ 'రమ నా కూతురు' (కొలుపులు). ప్రేమ మైకంలో ఊరు విడిచి వచ్చిన యువతి అత్యాచారానికి గురి అయ్యింది. ఫలితంగా పుట్టిన పాపకు పెళ్ళి కాని ఆమె ప్రేమించిన వాడే తండ్రి అని విశ్వసించింది, బిడ్డకు చెప్పింది. తల్లి దళిత కులంతో పెరిగిన పాప, ఎం.పి అయ్యింది. తండ్రి పేరు రీత్యా ఆమె దళితురాలు కాదనే కారణంతో ఆమె ఎంపిక చెల్లదంటూ కోర్టులో కేసు వేశారు. లా చదివిన దళిత ఎం.పి. తండ్రెవరో తెలియని తనకి తల్లే తెలుసు అని తన తల్లి కులమే తనకు వర్తిస్తుందని చేసిన వాదన కథకు ఆయువు. 2007లో వెలువడింది కొలుపులు సంకలనం. అంతకంటే చాల ముందు ఈ కథ రాయబడింది. కథ వచ్చిన నాటికి పిల్లల అన్ని దరఖాస్తులతో తండ్రి పేరు మాత్రమే నమోదు అయ్యేది. తల్లికి నామమాత్రంగా కూడా ప్రాధాన్యం లేదు. తప్పనిసరిగా తండ్రితో పాటు తల్లి పేరు కూడా నమోదు చేయాలని పదో తరగతి సర్టిఫికెట్లలో 2011 నుంచి ఇద్దరి పేర్లూ నమోదు అయ్యాయి (ఆచార్య కొలకలూరి ఇనాక్ 'కొలుపులు' – సామాజిక స్పృహ,ఈశంబట్టు ముని కుమారి, ఎం.ఫిల్ (గ్రంథం). సమాజం ఒక భావనని అవసరాన్ని గుర్తించి చట్ట రూపంలో తేవటానికి పూర్వమే ఇనాక్‌గారు ఈ రచన చేశారూ అంటే ఎంత ముందు చూపు ఉన్న రచయితో ఊహించవచ్చు. ఇలాంటి కథే 'బర్త్ సర్టిఫికెట్' (కొలుపులు) కూడా.

ప్రభుత్వ విధానాలకు మనసు ఉండదు. ముందూ వెనుక చూపు ఉండదు. ఒక సమస్యను తొలగించటానికి ప్రభుత్వం రూపొందించే ప్రణాళికలు, ఆ సమస్యతో అనుసంధానమయి ఉన్న పలు సమస్యలకు పరిష్కారాన్ని చూపలేవు. దాని వలన విఫలమవుతాయి. అటువంటి సంక్లిష్ట విషయాలను, గుర్తించని ప్రభుత్వ వైఫల్యాన్ని ఇనాక్‌గారు తన రచనల్లో నిలదీశారు.

మెదడువాపు ఒక వ్యాధి, అది వ్యాపిస్తుంది. వర్షాకాలాలలో ఇది పెచ్చు మీరుతుంది. ఈ వ్యాధి వ్యాప్తికి పందులు కారణం. కనుక పందులను సంహరించాలని ప్రభుత్వం ప్రచారం చేసింది. నిజానికి పందులు సహజ పారిశుద్ధ జీవులు. మరుగుదొడ్లు లేని పల్లెల్లో వీధుల్లో ఇవి శుభ్రం చేస్తాయి. ఇవి చాలా మందికి జీవిక. పందుల పెంపకం ఎంతో మందికి జీవనాధారం. అవే సంపద. అటువంటిది, వాటిని నివారించటమంటే, అనేక మంది జీవనాధారం పోగొట్టటమే! కొండ నాలుకకు మందెయ్యమంటే ఉన్న నాలుక పోగొట్టినట్టు, ఒక వ్యాధిని తొలగించటానికి సృష్టిలోని జీవాలను తొలగించటమా! జీవ వైవిధ్యం కాపాడాలనే నేటి తపనకు అది గొడ్డలి పెట్టే కదా! మెదడు వాపు రాకుండా ఏం చర్యలు చేపట్టాలో ఇంత మంది కడుపు కొట్టకుండా ఏం చేయాలో ఆలోచించమనే సూచన 'మెదడు వాపు' (కట్టడి) కథలో ఉంది.

ఇలాంటిదే మానవానుబంధాలకు సంబంధించిన కథ 'లేబరోళ్ళు' (కట్టడి). రెక్కాడితేగాని డొక్కాడని కుటుంబాలలో పసిపిల్లలయినా పని చేయాల్సిందే. అటువంటిది ఏ రోగగ్రస్థులయినా, ఆ కుటుంబంలో ఉంటే చిన్ని చేతులకు

పని తప్పదు. ఆ చిన్ని చేతులే కుటుంబాన్ని పోషించవలసి వస్తే?! కార్మిక చట్టం ప్రకారం బాల కార్మికులు ఉండరాదు. పిల్లలు కార్మికులుగా ఉంటే అలా దొరికితే ఆ యాజమాన్యానికి శిక్షే. కాలే కడుపును కాని, కాలే కుటుంబంలోని ఇతర కడుపులకు కాని కార్మిక చట్టం తిండి పెట్టదు. పద్నాలుగు సంవత్సరాలలోపు పిల్లలు చదువుకోవాలి. ఎవరు చదివిస్తారు? ఎవరు తిండి పెడ్తారు? ఈ అవసరాలు తీర్చకుండా, పని చేయటం నేరమని వారిని పనిలో నుంచి తొలగిస్తే, వారికి వారి కుటుంబానికి పోషణ ఎలా? రోగ మూల లక్షణానికి మందు పడక పోతే, బాహ్య ప్రదర్శిత లక్షణానికి మళ్ళీ మళ్ళీ మందు వేస్తూనే ఉండాలి, అయినా అది తలెత్తుతూనే ఉంటుంది అనే వాస్తవాన్ని ఒక చైతన్యాన్ని కల్పించింది ఈ కథ! 'సమాజ జీవనంలోని క్లిష్టత, వైచిత్రి, వైరుధ్యం, చలనశీలత, గమనశీలత తెలిసిన ఇనాక్‌గారి కథలు – కథకులకీ పాఠకులకీ కూడా పెదబాల శిక్షలు' అంటారు విహారి 'వెలుగును పెంచే కథలు' (ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై విమర్శనం, సం. డా. కొలకలూరి మధుజ్యోతి, పు. 122)లో .ఇది ఎంతో వాస్తవం.




సమాజ శ్రేయస్సును కాంక్షించటం ఇనాక్‌గారి కథల్లో స్పష్టంగా కనిపిస్తుంది. సమాజానికి, అధిక సంఖ్యలో జనాభాకి మంచి జరిగేటట్లు అయితే, దాని కోసం ఒక వ్యక్తి నష్టపోయినా ఫర్వాలేదు అనేది చాణక్య నీతి మొదలు అన్ని రాజనీతి శాస్త్రాలు చెప్పే వాస్తవమే. శాస్త్రాలు మానవ హృదయాలు కావు. మనసుండదు. కాని మనిషి శాస్త్రం కాదు. మనసుంటుంది. స్వార్థం ఉంటుంది. తనది అన్న దాన్ని ఆస్తిని నిలుపుకోవటానికి, దానిని పెంచుకోవటానికి అహర్నిశలూ ప్రయత్నిస్తాడు శ్రమపడతాడు. పైగా జననీ జన్మభూమి అనే భావాలు ప్రగాఢంగా ఉంటే?! జన్మస్థలాన్నే పోగొట్టుకోవలసి వస్తే?! ఎంత పరితాపం చెందుతాడు? అయినా, మందికి మేలు జరిగితే చాలనుకొన్నాడు శివన్నారాయణ. తాను భూ నిర్వాసితుడయినా తన పుట్టిన ఊరు ముంపుకు గురవుతుందన్నా ఆ పరిసరాలన్నీ డ్యాం వలన సస్యశ్యామలమవుతాయని ఆనందించాడు. ఆ జలాలలో తన గ్రామం సెన్నారం ఉందని సాగర్ జలాలలో తన పొలాలు ఉన్నాయని తను పుట్టినూరు లేని సన్నాసిని అని బాధపడినా, 'అయిదుకోట్ల మంది అన్నదమ్ములకు అన్నం పెడుతున్న తల్లి నువ్వు కలకాలం కళకళలాడుతూ ఉండు తల్లీ' అనే ఆయన విశాల దృష్టి, పోలవరం ముంపు గ్రామాల గురించి పత్రికలలో ఎప్పుడు వచ్చినా స్ఫురణకు వస్తుంది. సమాజం అలవర్చుకోవాల్సిన పరోపకారదృష్టికి 'పుట్టినూరు' (కాకి) కథ ప్రబల సాక్ష్యం.

సమాజానికి ప్రభుత్వానికి ముందు చూపు లేకపోతే కలిగే అనర్థాలకు, వారి బాధ్యతా రాహిత్యానికి అక్షర రూపం 'అనంత జీవనం' నవల. అనంతపురంలో కుంటి మేఘమో గుడ్డి మేఘమో తప్ప చినుకు రాల్చదని ప్రతీతి. అంత తక్కువ వర్షపాతం. కరవు ప్రాంతంగా మొట్టమొదట నిల్చేది నిత్యం అనంతపురం జిల్లానే. ఇంతటి వర్షాభావం ఉన్న ఊళ్లో నీరు లేని చెరువులు వాటి కాలువలు ఉండి ఏం లాభం, నీటి చుక్క లేకుండా!? దశాబ్దాలుగా ఇదే భావనలో ఉన్న జనం క్రమంగా వాటిని వినియోగించటం మానేశారు. పైగా ఆక్రమించుకోసాగారు. ఇంకా ఘనంగా పక్కా భవనాలు నిర్మించారు. ఇదంతా చూస్తూ ప్రభుత్వం కాదనలేదు, ఊరుకొంది. పైగా అనుమతులు ఇచ్చింది. మనిషి ప్రకృతికి ఎప్పుడూ లోకువే! ప్రకృతి విజృంభించింది. వర్షం పడింది. మిన్నూ మన్నూ ఏకమయ్యేలా! కుండపోతగా జడివానగా. గంట కాదు రెండు గంటలు కాదు. ఇరవై నాలుగు గంటలు. ఆకలిగా ఉన్న నేల పీల్చుకొన్నంత పీల్చుకొంది. ఇక పీల్చుకొనే ఖాళీ లేనప్పుడు వర్షపు నీరు కాలువలయ్యింది ఏరులయ్యింది వరదయ్యింది. 'ఈ తుఫాను / ఎవరి పాపం? / ఈ వరద / ఎవరిశాపం / ... /మనిషి చరిత్ర అంతా/ ప్రకృతితో పోరాటం' (ఇదెక్కడి శక్తి.. షరామామూలే). ప్రవహించటానికి మార్గం లేక ఉన్న కాలువలు ఏరులు చెరువులు మానవాక్రమితమైపోగా, తప్పనిసరై నీరు ఇళ్ళలోకి పోసాగింది, ఇళ్ళను కూల్చసాగింది. సాధారణ జీవితం అతలాకుతలం అయ్యింది. చిన్న వ్యాపారులు చెప్పులవాళ్ళు కుండల తయారీవారు, పూల వ్యాపారులు, గొర్రెల పెంపకందారులు ఒక్కేరేమిటి వీరందరి జీవితాలు ఎంతో నష్టపోయాయి. జనం ప్రభుత్వ యంత్రాంగం పాలుపోక తెల్లబోయిన స్థితి అది. ప్రకృతి ధర్మాన్ని అవహేళన చేసిన ఫలితం అది. అనంతపురంలో అనూహ్యంగా ఇరవై నాలుగు గంటలపాటు కురిసిన వర్షానికి అల్లాడిపోయిన ప్రజాజీవితానికి అద్దం పట్టిన అక్షర దృశ్యమాలిక 'అనంతజీవనం'.

బడుగు బలహీన జీవులు ఇనాక్‌గారి సాహిత్యంలో పెద్దపీట వేసుకొని కనిపిస్తారు. బాల్యం అపురూపమయినది

– అమ్మా నాన్నల రెక్కల మాటున ఉంటే, ఆర్థిక ఇబ్బందులు లేకపోతే. ఆటవిక పాశవిక ప్రవృత్తి చలామణి అవుతున్న మానవ సమాజంలో బాల్యాన్ని అమ్మ చెంగు నుంచీ తెంపేస్తుంది. బాల్యాన్ని కర్కశంగానయినా, ఆర్జన వైపుకు మళ్ళిస్తుంది. 'పసివాళ్ళ ముఖంలో స్వర్గం, కళ్ళలో దైవత్వం /కన్నా, మనిషంతా ఆశ కడుపంతా ఆకలి కావటం సత్యం /ఆకలికి ప్రాణం పోసి వీధుల్లో తిప్పాలంటే' (భయం-షరామామూలే) ఎవరికైనా బాధే. కాని మానవ కర్కశ వ్యాపార ధోరణికి, బాల్యం నేలరాయబడే పిల్లలెందరో!



పసివారిని ఎత్తుకుపోయి, కన్నో కాలో తీసేసి యాచనకు నిలబెట్టడం ఒక వ్యాపారం. వయసులోని వారి కంటే వృద్ధులు, వృద్ధుల కంటే పసివారు యాచనా మార్గంలో సంపాదనాపరులు. బాలల దయనీయ స్థితి చూపరుల గుండె పిండితే, అది కాసుల వర్షం కురిపిస్తుందని వ్యాపారస్థుల నమ్మకం. ఎంత పసివాడు అయితే అంత సొమ్ము. వారిని పోషించి, వారి నుంచి సొమ్ము సంపాదించే వ్యాపారి వారిని పారిపోనివ్వని కాఠిన్యమూ కలిగి ఉంటాడు. ఇలా ఎత్తుకొచ్చి కుంటిని గుడ్డిని చేసిన సీతారాములు పెరిగి పెద్దఅయి, ఒకరికి ఒకరు అండ అయి, ఆ నరకంలోనే జంట అయి, పారి పోవాలని వ్యర్థ ప్రయత్నం చేసి విఫలమయి రాజీపడి బతుకీడుస్తున్నారు. వారి కంటి ముందే వారుండే చోటే ఏడాది పసిదాన్ని అవిటిదాన్ని చేస్తే అల్లాడారు. వారికి కలిగిన కవలలను అవిటివారు కాకుండా కాపాడలేమేమో అనే భయం వారిని నిలవనీయలేదు. తమ బిడ్డకూ ఆ స్థితి సమీపించే సరికి తలుపులు మూసి కొడ్తే తిరగబడే పిల్లిలా తిరగబడ్డారు. ఒకానొక ఉన్మాద స్థితిలో భిన్న ప్రాంతాలలో వ్యాపారిని అతడి అనుచరుడిని సీతారాములు కర్రలతో మోది చావగొట్టారు. వారి శృంఖలాల నుంచి బయటపడ్డారు.

సమాజంలో నెలకొని ఉన్న వాస్తవ స్థితిని చూపటమే కాదు ఆ స్థితి నుంచి బయటపడాలనే ఆలోచన బయటపడగల ధైర్యం ఆయా పాత్రలలోనే చొప్పించి సమస్య నుంచి బయటపడటాన్ని రచయిత చిత్రించారు. ఎవరి సమస్యలను వారే పరిష్కరించుకోవాలి. ఈ నవల – 'రెండుకళ్ళు మూడు కాళ్ళు'– లో సీతారాములు పారిపోవాలనుకొన్నారు. రెండుసార్లూ విఫలమయ్యారు. కబంధ హస్తాల నుంచి వారు కాదు, వారి పిల్లలు అన్ని అవయవాలతో సజీవంగా తిరగాలంటే వారి నుంచి ముక్తి తప్పదు. అదే జరిగింది. వాస్తవాన్ని దయనీయంగా చిత్రించటం కంటే చైతన్యాన్ని స్ఫూర్తిని ఇచ్చే ముగింపు ఎంతో మేలు.

ఇనాక్‌గారి రచనలు ఎప్పుడూ సమకాలీన జీవితాన్ని, మానవ ఆలోచనలను సమాజ తప్పిదాలను, స్వార్థం పన్నే కుయుక్తులను, మానవత్వాన్ని అణచేసే రాక్షస వికృత వివక్షా స్వరూపాన్ని, ఆలంబన చేసుకొన్నాయి. ఇనాక్‌గారు తన రచనా ప్రయాణంలో సమకాలీన వాస్తవ జీవితాన్ని కేవలం చిత్రించలేదు. దానిలో ఉన్న మర్మం తేటతెల్లం అయ్యేలా చేశారు. ఇనాక్ గారి రచనలు కడుపు నిండిన కబుర్లు కావు. కడుపు నిండాల్సిన అవసరానివి, కడుపు మంట రగిలించే కసాయి వాస్తవాలవి. ఆకలి, ఆహారం దొరకనివ్వని వైరుధ్య వాస్తవాలలో నలిగే జనం కేవలం, దళితులు స్త్రీలు, వెనుకబడినవారు, మైనారిటీలు మాత్రమే కాదు. వీరందరూనూ. బరువైన వస్తువుతో సాగిన సాహిత్యంలో జనం అనుభవాన్ని చిత్రించారు.

జనం అనుభవిస్తున్న అవమానాన్ని, అరాచకాన్ని, అణచివేతను, వివక్షను ఎదుర్కొనే, ఎదుర్కోవాల్సిన అవసరాన్ని మార్గాన్ని కూడా తన సాహిత్యంలో చూపారు. వాస్తవాన్ని చిత్రించటం, దానికి పరిష్కారాన్ని చూపటమే కాదు, కొన్ని సందర్భాలలో, సమాజానికి భవిష్యత్ కార్యాచరణకు కావలసిన మార్గాన్ని సూచించారు. కవి క్రాంతిని దర్శిస్తాడు. అందరి కంటే ముందు నడుస్తాడు, భావిని చూస్తాడు. దార్శనికుడయిన కవి రచయితకే అది సాధ్యం. సమాజంలో ఉన్న ఆలోచన రేపు రావలసిన మార్పు మధ్య ఒక వారధిని ఏర్పర్చుకోగలవాడే 'దార్శనికుడు కాగలడు. అటువంటి దార్శనికత ఇనాక్‌గారిది. అందుకు ప్రబల తార్కాణం వారి రచనలు.

రచయితలు సామాజిక స్పృహ, సామాజిక బాధ్యత ఉండటాన్ని గూర్చిన స్పష్టత ఆధునికత సంతరించుకొన్నప్పటి నుంచి ఉన్నదే. దానికి దార్శనికత జోడింపు అయితే, ఆ రచన ఎంత గొప్పదో, ఆ రచయిత మిగిలిన వారి కంటే ఎంత ముందు చూపున్నవాడో అవగతం అవుతుంది.

వాస్తవ దృష్టి, పరిష్కార మార్గ సూచన, దార్శనికత ముప్పేట శక్తులుగా అల్లుకొన్న రచనలు ఇనాక్‌గారిని నిస్సంకోచంగా మంది నుంచి వేరు చేసి అద్వితీయులని చాటుతాయి. ఈ అద్వితీయుని మకుటానికి అమేయ మణి ప్రకాశం పద్మశ్రీ పురస్కారం.






# 9-11, 24-7

◆ ఆంగ్ల మూలం: నీల్ హాల్, బ్లాక్ అమెరికన్ కవి

తెలుగు: ఓల్గా

నల్లజాతి అమెరికన్లకు
ప్రతిరోజూ ఇరవైనాలుగు గంటలూ
సెప్టెంబర్ పదకొండే

అమెరికన్ అసమానతల సవరణల పుటలలో
అర్థశూన్య పదాల గందరగోళపు అమరికల కింద
భయోత్పాతం సమాధి చేయబడింది
నాలుగొందల సంవత్సరాల కిందట
నల్లజాతి ప్రజలను దొరకబుచ్చుకుని, ఎత్తుకుపోయి
నౌకల్లోదాచి, అమెరికన్ శ్రామికులుగా హైజాక్ చేసి
అమ్మటానికి, కొనటానికి చిత్రహింసల సంతలు
కాన్సంట్రేషన్ క్యాంపుల్లా నడిపి
చెప్పుకోలేని బానిసత్వంలోకి
హీనస్థానంలోకి నెడితే విదేశీ ప్రయోజనాల కోసం
మన నేలను నెలవును పోగొట్టుకున్నాం

నల్లజాతి అమెరికన్లకు
ప్రతిరోజూ ప్రతిక్షణమూ సెప్టెంబర్ పదకొండే

అంతులేకుండా దూసుకొస్తున్న అమెరికన్ ఆయుధాలు
తలెత్తుతున్న నల్ల స్వప్నాల, ఆశల టవర్లను
ప్రతిరోజూ ప్రతిక్షణం ధ్వంసం చేస్తూ
కుప్పకూలుస్తున్నాయి.
సూత్రబద్ధంగా విధించబడ్డ పాశవిక క్రూరత్వంతో
నిరంతరం ముందుకు దూసుకెళ్తున్న విద్వేషం
మనలో తగినంత భయం నింపేందుకు
వారి ఆర్థిక ప్రగతికై మనల్ని హీనస్థితిలో ఉంచేందుకు
ఇరవై నాలుగు గంటలూ అమలు చేయబడుతోంది.

నల్లజాతి అమెరికన్లకు
365 రోజులూ ఇరవై నాలుగు గంటలూ
సెప్టెంబర్ పదకొండే

నాలుగొందల సంవత్సరాలకు పైగా
ప్రజాస్వామ్యపు స్లెడ్జ్ బండ్ల చేతుల తోపుడు
దుర్మార్గానికి అజ్ఞానపు నిశ్శబ్ద ఆమోదంతో
పొగలలో అద్దాలలో జారుతూ పడుతూ

పోకర్ ముఖపు జఫర్సన్ మార్కు ప్రజాస్వామ్యం
తన స్వేచ్ఛా హస్తాన్ని మోసం చేస్తూ, అబద్ధం చేస్తూ
ఎల్లప్పుడూ నియంతృత్వపు ఆసుముక్కను
తన తెల్లజబ్బులో దాచుకుంటూ
నల్లజాతి ప్రజలు అక్కడికి చేరగలరనే హామీ లేకుండా
డొంక దారిలో వ్యూహాత్మకంగా
జాతి వివక్షా రహదారులను ఏర్పరుస్తూ

వివక్షా పూరిత లోభలాభాపేక్ష చట్టాల, న్యాయాల హత్యాకాండ
నల్లవారి గృహాల, కుటుంబాల ఆత్మలనుండి వారి తలలు
తెగనరుకుతూ
ప్రతి ఇరవై మంది నల్లవారిలో ఒకరి ప్రాణాలు తీసేస్తూ,
తెల్లవారి నేరాలతో
పోలిస్తే వారికంటే పదిరెట్లు ఎక్కువగా నల్లవారిని జైలు
పాల్జేస్తూ, [1]
ఈ హీనస్థితి నుంచి మనల్ని ఉద్ధరించేందుకు మనలో నుంచి
ఒక నాయకుడు
తయారవకుండా ఒక సున్నితమైన జెనోసైడ్ సుతారంగా
జరుగుతోంది.
హత్య చేసేందుకు ఒక మర్యాదా పురుషోత్తముడు

పన్నిన వల, అత్యాచారం, అఘాయిత్యం
చిత్రహింసలు, తన్నులు, నరికివేతలు, సాంఘిక వెలి,
ఆర్థిక పరాధీనత
బానిస తల్లుల రొమ్ములనుంచి బలవంతంగా లాక్కోబడిన
బానిస పిల్లలను
బానిస పిల్లలుగానే ఉంచాలని, తలపై ప్రజాస్వామ్యపు
మెత్తని మేలిముసుగు ధరించిన
మొదటి కుటుంబాలు అమలు చేసిన హింసాపూరిత
బాధాయాతనలకు అమ్ముడు బోయిన బానిస పిల్లలు.

నల్లజాతి ఆమెరికన్లకు
నాలుగొందల సంవత్సరాలకు పైగా
నిత్యమూ నిరంతరమూ సెప్టెంబర్ పదకొండే

మా ఎగసే నల్లని ఆశల ఆశయాలపైకి
ప్రతి రోజూ ఇరవైనాలుగు గంటలూ
అమెరికన్ ఆయుధాలు దూసుకొస్తూ
ఢీకొడుతూ కుప్పకూలుస్తున్నాయి
తాత్కాలిక ఉపశమనాలు లేవు, సమానత లేదు
కనీసపు కరుణ లేదు, న్యాయం లేదు
కనుచూపు మేరలో ఓదార్పన్నా లేదు
ఆర్థిక పునరుద్ధరణల కోసం
ఐక్యరాజ్య సమితి తీర్మానాలకై
ప్రపంచ దేశాల ఒత్తిళ్ళు లేవు.

నల్లజాతినంతా నాశనం చేసే
అమెరికన్ ఆయుధాలను ధ్వంసం చేసేందుకు
ప్లాంటేషన్ల తీరాలపై గుమిగూడిన
అంతర్జాతీయ శాంతి కాముకులు లేరు.

అమెరికన్ జాతి వివక్షత లోని
అన్యాయపు దోపిడీ శిధిలాలనుంచి
మమ్మల్ని రక్షించేందుకు, ఉద్ధరించేందుకు,
పైకి లేపేందుకు
వెదుకులాట లేదు, వెతికేందుకు రక్షణ దళాలు లేవు
సవరణల అమెరికన్ చరిత్ర తెల్లపుటలలో
కపటత్వపు డొల్లతనం కింద లోతుగా పాతేసిన
సగం మసిబారి చినిగి ముక్కలవుతున్న
నల్లజాతి జండాను పైకెత్తేందుకు
గౌరవనీయ అతిధుల సమావేశాలు లేవు

పూర్తిగా తగలబడ్డ 36 మిలియన్ల బాధితులను [2]
తుడిచి పెట్టేసిన ఆనవాళ్ళ కోసం
తెల్ల నక్షత్రాల కింద, చారల కింద
చప్పుడు లేకుండా పేరులేకుండా
కొట్టుకు పోయిన వారి ఆచూకీ కోసం
సెప్టెంబర్ పదకొండు కమిషన్లు లేవు
నాలుగొందల సెప్టెంబర్ పదకొండులను
స్మరించుకునేందుకు ఒక రోజంటూ
కాస్త సమయమంటూ కేటాయించిందీ లేదు
అమెరికన్ ఆర్థిక ప్రగతిని సులభతరం చేసేందుకు
గుంజలకు కట్టి తగల బెట్టిన
నల్లవారికి, వారి స్త్రీలకు, పిల్లలకు
365 రోజులూ 24 గంటలూ
సెప్టెంబర్ పదకొండే

సుదూరంగా వినబడే గంటల చప్పుడులో
వీడ్కోలు చెబుతూ పేర్లు చెక్కిన గుర్తులతో
సమాధులూ లేవు

బలవంతంగా లాక్కున్న, ఎత్తుకు పోయిన
ఓడల్లో దించిన, దొంగిలించి మాయం చేసిన
నల్లవారి ఆశల ఆశయాల టవర్లను
తిరిగి చూసే, తిరిగి నిర్మించే
స్వర్గమూ లేదు నరకమూ లేదు

నల్లజాతి అమెరికన్లకు
నిత్యమూ నిరంతరమూ
సెప్టెంబర్ పదకొండే

*1. హ్యూమన్ రైట్స్ వాచ్- యునైటెడ్ స్టేట్స్, పనిష్మెంట్ అండ్ ప్రిజుడిస్: రేసియల్ డిస్పారటీస్ ఇన్ ద వార్ ఆన్ డ్రగ్స్*
*2. ఆఫ్రికన్ అమెరికన్ హిస్టరి, మెల్బాజె, డన్కన్, సిహెచ్.*



## కథ

# ఇనుపరెక్కల వల

◆ డా॥ ఎ. రవీంద్రబాబు
9394489263



అవును నాకు రెక్కలొచ్చాయి. సారీ రెక్కలు మొలిపిస్తున్నారు. నాలో ఎక్కడ కావాలంటే అక్కడ. ఎప్పుడు కావాలంటే అప్పుడు రెక్కల్ని పుట్టిస్తున్నారు. వాళ్ళ అవసరాల్లోంచి, వాళ్ళ అధికారాల్లోంచి నాకు రెక్కలు వచ్చేస్తున్నాయి. వాటిని ఎలా కత్తిరించాలో, ఎంతవరకు కత్తిరించాలో బాగా నేర్చుకున్నారు. భూమి చెప్తూ ఉంది.

సూర్యకుటుంబంలోని గ్రహాలు, పంచభూతాల్లో మిగిలిన నాలుగు వింటూ ఉన్నారు. కానీ వారికి సరీగా బోధపడడం లేదు. కానీ భూమిని ప్రశ్నించే సాహసం చేయలేకపోతున్నారు. ఎందుకంటే..? అప్పటికే భూమి లోపలున్న అగ్నిపర్వతాలు బద్ధలవుతున్నాయి. ఏడుపు సునామీలా పొంగుకొస్తుంది. అందుకని ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. మౌనంగా వింటున్నారు. భూమి చెప్పే మాటల్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నారు.

భూమి చెప్తూనే ఉంది.

నా బాధ మీరు అర్థం చేసుకోండి... నేను ఇక ఎవరి దగ్గర మొరపెట్టుకొను...! మీరే నాకు ఏదో ఒక విధంగా న్యాయం చేయాలి. అంటుంటే ఆమె కళ్లల్లో కరుగుతున్న మంచు సముద్రాల్లో కలుస్తుంది.

సూర్యుడు కలుగజేసుకుని... నీకు వచ్చిన కష్టం ఏమిటి? అర్థం అయ్యేలా చెప్పు అన్నాడు.

మనందరం అవతరించి ఎన్ని సంవత్సరాలు గడిచాయో ఇప్పటికీ ఎవరూ మానవ లోకంలో లెక్కకట్టలేదు. కానీ... మనల్ని ఎలా తమకు అనుకూలంగా వాడుకోవాలో... అభివృద్ధి పేరిట మనల్ని ఎలా నాశనం చేయాలో బాగా అర్థం చేసుకున్నారు. నా సహజత్వానికి నన్ను దూరం చేస్తున్నారు. నాకు నేను మిగలకుండా మింగేస్తున్నారు. నన్ను ఓ విషవలయంలోకి నెట్టేస్తున్నారు. భూమి మళ్లీ ఆవేశంగా చెప్పుకుపోతూ ఉంది.

ఈసారి చంద్రుడు అడ్డు వచ్చాడు. నీ ప్రసంగం ఆపుతావా... మాకు చెప్పడం కాదు. చూపించు అన్నాడు.

సూర్యుడు, బుధుడు, శుక్రుడు, గురుడు లాంటి మిగిలిన గ్రహాలు, అగ్ని, ఆకాశం, నీరు, వాయువు కూడా చూపించాలి అన్నాయి.

ఆధారాలు కావాలట.... ఆధారాలు... సరే నాతో రండి... నా గురించే కాదు, మీ గురించి మీకు తెలియని ఎన్నో వింతలు, విశేషాలు చూపిస్తా అని వాళ్లందర్నీ తీసుకొని తనలోకి తాను బయలుదేరింది భూమి.

ఇది ఒకప్పటి హిమాలయ దిగువ ప్రాంతం. తెల్లటి మంచులో మల్లెపరిమళంలా ఉంటాను నేను. ఇక్కడ గంగ, యమునా నదులు నాలో స్వరరాగ జలనిధులుగా సాగుతాయి. శివ భక్తి పుణ్యధామాలైన కేదారినాథ్, బద్రీనాథ్‌లు ఇవే.

యమునోత్రి, గంగోత్రి... ఇలా ఎన్నో ఇక్కడ విరాజిల్లుతున్నాయి. భూమి చెప్తుంటే... ఇంకేం... నీకు ఇక్కడ పుణ్యం ఈ మానవుల వల్లే లభిస్తుంది కదా... అన్నాడు చంద్రుడు.

భక్తులు వేలల్లో కాదు లక్షల్లో ఆ స్థలాల్లో ఉన్నారు. నిత్యం శివ నామస్మరణలో ఆ దేవాలయాలు మార్మోగుతున్నాయి. కార్లు, బస్సులు... ఆ చిన్న చిన్న రోడ్లల్లో జనాలతో సాగుతున్నాయి. నదులపై కట్టిన చిన్న చిన్న బ్రిడ్జీలపై ఇరుకిరుగ్గా నడుస్తున్నారు భక్తులు. చిన్న చిన్న ఇళ్లల్లో అక్కడి ప్రజలు ఆ అడవుల మధ్య.

ఇంతలో హఠాత్తుగా గంగానది ఉప్పెనైంది. యమున విజృంభించింది. చిన్న చిన్న బ్రిడ్జీలు కూలిపోయాయి. కార్లు బస్సులు కొట్టుకుపోయాయి. నడుస్తున్న వాళ్లు నడుస్తున్నట్లే... తల్లికి పిల్లల్లేరు, భర్తకు భార్య కనపడటం లేదు. తమ్ముడికి అన్నలేడు.... ఎవరు ఆ ప్రవాహాల్లో ఎటు పోతున్నారో తెలియడం లేదు. అంతా జలమయం. పొంగిపొరలుతున్న మృత్యుఘోష. చెట్టుకొకరు, పుట్టకొకరు అన్న లెక్క అయింది. ఒక్కసారిగా ... అదో ప్రకృతి వికృత కరాళనృత్యం.

ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు... మూడు రోజులు... గంగమ్మ, యమునమ్మల విజృంభణ.

చూస్తున్న గ్రహాలు తట్టుకోలేకపోయాయి. కన్నీరై కరిగిపోయాయి. కొంత సేపు ఏ చలనం లేకుండా అలానే ఉండిపోయాయి.

ముందు తేరుకున్న బుధుడు అడిగాడు ఎందుకు జరిగింది ఇదంతా...? అసలు ఏమైంది? ఒక్కసారిగా నీలో ఈ ఉత్పాతం ఏమిటి? నదులు ఎందుకలా ఉప్పొంగాయి? అన్నాడు.

అభివృద్ధి... ధనం... సంపాదన. టూరిజం... ఇలా ఎన్ని పేర్లో తెలుసా ఈ బీభత్సానికి కారణం. ఇక్కడకు వచ్చే వారికోసం సకల సౌకర్యాలు ఏర్పరచాలి. పర్యాటక శాఖను అభివృద్ధి పరచి ఎక్కువ మంది వచ్చేలా ఆకర్షించాలి. రాష్ట్ర ఖజానా నిండాలి. ఆ ఆశలతోనే... నదులుకు ఎక్కడపడితే అక్కడ అడ్డుకట్టలు వేశారు. వారి ఇష్టం వచ్చినట్లు అడవులు నరికి స్థలాలు చేసి అమ్మారు. వ్యాపారం పేరుతో ఎన్నో హంగులు, ఆర్భాటాలు... ఇలా ఎన్నని చెప్పేది. చివరకు వాళ్లకు వాళ్లే... ఇలా... భూమి తనలో దాచుకున్న తన గుండెకోతను వాళ్లముందు దృశ్యాలుగా వెళ్లబోసుకుంది.

ఈ మనుషుల అత్యాశకు ఏం చెయ్యాలో, భూమిని ఎలా ఓదార్చాలో తెలియలేదు. మిగిలిన వాళ్లకు, వాళ్లూ ఆలోచనలో పడ్డారు.

వాళ్లను తీసుకొని భూమి మళ్లీ కాలంలో... తనలోని మరో స్థలానికి వెళ్లింది.

* * *

అన్ని గ్రహాలు... చూస్తుంటే భూమి చెప్తుంది...

ఇది హైదరాబాద్ నగరం. భారతదేశంలో అభివృద్ధి చెందిన నగరాల్లో ఇదీ ఒకటి. హైటెక్ నగరంగా దీన్ని అభివృద్ధి ప్రేమికులు పిలుచుకుంటారు. చూడండి అని తనలోని ఓ చిన్న ప్రదేశాన్ని చూపించింది.

అందరూ శ్రద్ధగా, ఆశ్చర్యంగా, వింతగా... ఆలోచనాత్మకంగా చూడడం ప్రారంభించారు.

ఎక్కడ చూసినా గగనానికి ఎగబాకిన మేడలు, ఆ మేడల్లోని గదుల్లో పనిరాక్షసుల్లా బతుకుతున్న జనాలు, త్రాచుపాముల్లా రోడ్లు, ఆ రోడ్లనిండా వాహనాల్లో పరుగులు పెట్టే మనుషులు. వింత వింత శబ్దాలు, దుమ్ము, ధూళి, పొగ... ఎక్కడికక్కడ ఉబ్బినట్లు కనిపించే ఫ్లై ఓవర్లు, ఫ్యాక్టరీల నుంచి వస్తున్న విష, జలవాయువులు, చిన్న చిన్న బస్తీలు, మురికి కూపాలు, కాల్వల్తో... హాస్పటళ్ల నిండా రోగాల కంపు, కాలుష్యపు కోరలు... చంద్రుడు తన కాంతిని పౌర్ణమి రోజులా పెంచి చూసినా అక్కడో చెట్టు, ఇక్కడో కార్పొరేట్ లాన్, కృత్రిమమైన పార్కులు మాత్రమే కనిపించాయి. ఇక పక్షుల జాడైతే చెప్పనక్కరలేదు. రాత్రిళ్లు నియాన్ లైట్ల వెలుతురులో ముసుగేసుకున్న కృత్రిమ అందగత్తెలా ఉంది నగరం.

ఇదంతా చూస్తున్న వారెవరికి ఏమీ అర్థం కాలేదు.

ఏమిటిదంతా? అని భూమిని అడిగాయి.

భూమి తన బాధను హుస్సేన్ సాగర్ చెరువులా మింగి వాళ్లను మళ్లీ చూడండి అంది.

అందరూ భూమి చూపించిన వైపు చూశారు. అది నగరానికి దగ్గరున్న స్థలం.

అక్కడంతా పచ్చగా ఉంది. ఆకుకూరలు, టొమోటోలు వంటి పండ్ల వాసనలతో గుభాళిస్తుంది. మధ్యమధ్యలో గట్లమీద వేపచెట్లు లే ఎండకు కొమ్మలు ఊపుతూ నవ్వుతున్నాయి. పక్కనే ఐదారుగురు వ్యక్తులు మాట్లాడుకుంటున్నారు.

లేదు సార్... తెలంగాణ రాష్ట్రం వచ్చినంత మాత్రాన ఇక్కడ భూములు రేట్లు ఏం పడిపోలేదు. ఇక్కడ డెవలప్ ఇంకా పెరుగుతుంది. తగ్గదు. ఎన్నో కంపెనీలు వస్తున్నై.

ఇదంతా కాదు. ఎంతకిస్తాడు చెప్పు. అని బ్రోకర్‌తో అంటున్నాడు కొనేవ్యక్తి.

ముందు చెప్పినట్లే ఆరున్నరకోట్లకు ఏమాత్రం తగ్గదు. మీకిష్టమైతే తీసుకోండి. లేకపోతే లేదు. అప్పటికీ వోనర్ చెప్పిన దానిమీద నేను పది లక్షలు తగ్గించాను. అన్నాడు బ్రోకర్.



దీనిని నేను కొనేది మళ్లీ అమ్ముకోడానికి కాదు. ఇక్కడ చిన్న కెమికల్ కంపెనీ స్టార్ట్ చేస్తాను. మీ వాళ్లందరికీ ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. అభివృద్ధి గురించి ఆలోచించుకోమని చెప్పు. అన్నాడా వ్యక్తి.

సరే... సరే... నేను వోనర్‌తో మాట్లాడి మీకు ఫోన్ చేస్తాను అన్నాడు బ్రోకర్.

సరే కాదు. ఒప్పుకుంటేనే...! కాదంటే...!? ఆంధ్రప్రదేశ్‌లో పెడ్తాం. అన్నాడు పక్కనున్న మరో వ్యక్తి.

అందరూ కార్లల్లో వెళ్లిపోయారు.

అప్పటి వరకూ హైదరాబాదు చుట్టుపక్కల ఉన్న కెమికల్ కంపెనీల వల్ల పారిశ్రామిక వాడల్లో మంచినీళ్లలో కలుస్తున్న వేస్టు కెమికల్స్, భరించరాని వాసనలు, దానితో రోగాలతో సతమతమవుతున్న మనుషులను చూసిన గ్రహాలు...

ఈ సంభాషణలు విని ఇప్పుడు ఈ ఆకుపచ్చని వనం కూడా.. అలా మారిపోతుందన్న మాట!!! అన్నాయి చమర్చిన కళ్లతో...

అక్కడ నుండి భూమి మళ్లీ మరో స్థలానికి తీసుకెళ్లింది.

చూశారుగా మానవుల అభివృద్ధి, పురోగమనం, నన్ను నిత్యం కాలుష్యం చేస్తున్నారు. నాతోపాటు మిగిలిన భూతాలను కూడా... దాంతో ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్నారు. నన్ను, నాకు తెలుస్తూనే అమ్మకానికి పెడుతున్నారు. తీరా అమ్మి నాలోని సహజత్వానికి పాతర వేస్తున్నారు అంది భూమి.

నిజాన్ని తెలుసుకుంటున్న ఇతర గ్రహాలు, నాలుగు భూతాలు నిశ్చేష్టులై వింటున్నాయి.

అప్పుడే కాదు మీకు నాలోని కొన్ని వాస్తవ దృశ్యాలను చూపించాలి. నాలో నేను కుమిలి ప్లాస్టిక్‌నై తగలబడుతున్న వాసనలు చూపించాలి. అని ఒకప్పటి తనలోని మరో స్థలానికి తీసుకెళ్లింది.

ఇదే తుళ్లూరు, అమరావతికి అతి దగ్గర. గుంటూరు సమీపం. విజయవాడకు కొద్దిగా పక్కన. ఆ బుద్ధదేవుడు అవశేషాలను నాలో దాచుకున్న పవిత్ర ప్రదేశం. పక్కనే కృష్ణమ్మ గలగలలు. పంచారామాలలో ఒకటిగా ప్రసిద్ధికెక్కిన అమరేశ్వరాలయం అని తన జ్ఞాపకాలను పంచుకుంది మిగిలిన వారితో....

వాళ్లందరూ.... ఆ ప్రదేశాన్ని భక్తితో, ఆరాధనా భావంతో చూస్తున్నారు. అక్కడి పొలాలన్నీ మినుములు, మిర్చి, మొక్కజొన్న లాంటి పంటలతో ఉన్నాయి. చుట్టుపక్కల చిన్న చిన్న గ్రామాల్లోని ప్రజలు ప్రకృతికి కొంత దగ్గరగా జీవిస్తున్నారు అన్న భావన కలిగించేలా తోచాయి వాళ్లందరికీ.

ఫర్వాలేదు. నీవు ఇక్కడ కొంత ప్రశాంతంగానే కనబడుతున్నావు. కొంత ఓదార్చేలా అన్నాడు గురుడు. గాలి, నీరు కూడా మనమూ ఇక్కడ కొంత స్వేచ్ఛగానే ఉన్నాము అని మనసులో తృప్తిపడ్డారు.

రండి మీరందరూ నాతో ఇలా రండి... అని భూమి రిజిస్ట్రేషన్ ఆఫీసును చూపించింది.

జనాలు కుప్పలు తెప్పలుగా భూములు అమ్ముతున్నారు. కొంటున్నారు. హాట్ కేకుల్లా భూమి పొరల్ని కొనుక్కుతింటున్నారు. ఖాళీ భూమి అయితే ఇంత, పంటపొలం అయితే ఇంత, ఇళ్ల స్థలం అయితే ఇంత, హైవే రోడ్డుకు దగ్గరగా ఉంటే రేటు మరీ ఎక్కువ... అదో తంతులా జరుగుతుంది.

పెద్ద పెద్ద వాళ్లందరూ బ్యాగుల్లో, బాక్సుల్లో డబ్బులు తెచ్చి కుప్పలుగా కుమ్మరించి కొనుక్కుంటున్నారు. అమ్మే వాళ్లు కూడా సంతోషంగా అమ్ముతున్నారు. మరికొందరు.. ఇంకో నాలుగేళ్లు పోతే ఇంకా రేటు పలుకుతుంది. అని వెనక్కు తగ్గుతున్నారు.

ఇద్దరు ముగ్గురు ముసలోళ్లు... ఓరే... ఆ చారెడు భూమి ఉండేబట్టేరా...! నిన్ను చదివించింది. ఇంట్లో నాలుగు మెతుకులు తినింది...! దాన్ని అమ్మి ఏం బావుకుతింటావురా...? రేపు మీ పిల్లలకు ఏం మిగుల్చుతావురా..? అంటున్నారు కానీ ఫలితం మాత్రం లేదు.

ఇదంతా ఏమిటి? నిన్ను ఎందుకు ఇలా ఇక్క కొంటున్నారు? అని గురుడు అడిగాడు. చెప్పాను కదా... ఈ మధ్యనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం రెండుగా విడిపోయింది. కొత్తగా ఏర్పడే ఆంధ్రప్రదేశ్ రాజధాని ఈ పరిసర ప్రాంతాల్లో రావచ్చని వినికిడి. అందుకే ఈ తతంగం అంతా... చూశారా..? నన్ను ఇక్కడ కూడా ఓ కాంక్రీట్ జనారణ్యంలా మార్చబోతున్నారు అంది. బుద్ధదేవుడు మళ్లీ పుట్టి కొత్త బోధలు చేస్తే భావుణ్ణు అనే ఆశతో.



అప్పుడే అక్కడకు ఇద్దరు వ్యక్తులతో ఓ ముప్పై ఏళ్ల వ్యక్తి వచ్చాడు.

మీరు ఎన్నైనా చెప్పండి నాకు ఉన్నది నాలుగు ఎకరాలు. ఎకరా కోటి పాతిక లక్షలు. నాలుగు ఎకరాలు ఐదు కోట్లు. ఇష్టమైతే సంతకం పెట్టా... లేకపోతే... పొండి అని దబాయిస్తున్నాడు.

సరేనయ్యా... మీ నాన్న ఉన్నాడు. మీ అమ్మ ఉంది. వాళ్ల సంతకాలు కూడా అవసరం కదా... అన్నాడు కొనే వ్యక్తి.

వాళ్లదేముంది.. ముసలోళ్లు అదీ ఇదీ అని అడ్డుచేస్తే.. నాలుగేట్లు వేసేనంటే.. అంతే...! ముందు రేటు ఓకే అయితేనే... ! అన్నాడు.

అన్ని గ్రహాలు కాదు, పంచభూతాలు నివ్వెరపోయారు.

ఇది నాకు చుట్టుకుంటున్న పాపం. ఆత్మీయతలు, కన్నపేగులను కూడా తెంచే స్థాయికి నన్ను దిగజార్చారు. ఈ మనుషులు, ఛీ... అని తనను తాను ఛీదరించుకుంది భూమి. కానీ ఆ ఛీదరింపులోని బాధను అర్థం చేసుకున్నారు మిగిలిన వాళ్లు. ఇక అక్కడ ఉండలేక ఇక్కడ నుండి వెళ్లిపోదాం అన్నారు మిగిలిన గ్రహాలు.

కానీ భూమి ఛీదరింపులోంచి తన బాధను చెప్పుకోసాగింది.

ఈ భూగ్రహం కేవలం మనుషుల సొంతం కాదు. 33 కోట్ల జీవరాశుల సొంతం. కానీ వీళ్లు తమ అతితెలివితో మిగిలిన వాటిని చంపేస్తున్నారు. వీళ్లవే సర్వాధికారాలు అన్నట్లు ప్రవర్తిస్తున్నారు. సమతౌల్యాన్ని దెబ్బతీసి, తమ మరణాన్ని తామే కొనితెచ్చుకుంటున్నారు. అయినా వీళ్లకు జ్ఞానోదయం కలగటం లేదు. ఏం చెయ్యాలి...? ఏం చెయ్యాలి...?!!

తలవొంచుకుని దిగులుతో అన్ని గ్రహాలు, నాలుగు భూతాలు భూమిని చూస్తూ... గొంతుదాటని వేదనను అనుభవిస్తున్నాయి.

అప్పుడు వాళ్లకు భూమి మీద తండ్రిని ప్రశ్నిస్తున్న ఓ కొడుకు కనిపించాడు. వాళ్ల నాన్న ఇండియాలోనే బడా ఇండస్ట్రీయలిస్ట్. ఏదో కొత్త పరిశ్రమకు ఇటీవలే కేంద్రప్రభుత్వం ఓ కె చెప్పింది. ఆ పనిలోనే ఉన్నాడిప్పుడు.

కొడుకు వయసు పద్నాలుగేళ్లకు అటుఇటుగా ఉంటాయి. అప్పుడే స్కూలుకు వెళ్లి వచ్చినట్లున్నాడు. షూ, డ్రెస్ మార్చుకొని కుర్చీలో వచ్చి కూర్చోన్నాడు. పని మనిషి పాలు తెచ్చి ఇచ్చింది. తాగుతున్నాడు. క్లాసులో సాంఘికశాస్త్రం చెప్పే మాష్టారు అన్న మాటలే పదేపదే గుర్తొస్తున్నాయి.

తరతరాల నుంచి మనుష జాతి ఈ భూమిని లొంగదీసుకొని, ప్రకృతిని నాశనం చేస్తుంది. క్రమంగా అది మన అంతాన్ని చవిచూసే రోజులు దగ్గర పడుతున్నాయి. అందుకే ఈ సునామీలు, భూకంపాలు, వరదలు....

అదే ప్రశ్న వాళ్ల నాన్నను అడిగాడు.

డాడీ... ఈ నేచర్ మీ ఒక్క జనరేషన్ సొంతం కాదుకదా... మీ ముందు ఎన్నో జనరేషన్స్ ఉన్నాయి. మీ తర్వాత ఇంకొన్ని జనరేషన్స్ ఉంటాయి. మరి మీరొక్కరే ఈ ప్రకృతికి అధికారులుగా వ్యవహరిస్తే..! పూర్తిగా వాడుకుంటే...! తర్వాతి తరాల పరిస్థితి ఏంటి? మాకూ హక్కు ఉంటుంది. కదా...! మమ్మల్ని, మా తర్వాతి వాళ్లను స్వచ్ఛమైన నేచర్‌కు దూరం చేస్తారా....? మీకు ఆ హక్కు ఎవరిచ్చారు? ప్రకృతిని ఎంత మనకు అనుకూలంగా వాడుకుంటున్నామో... మనం మనకు అంతదూరం అయినట్లేనట...! అన్నాడు.

తండ్రి బిత్తరపోయి కొడుకును చూశాడు. కొడుకుకు ఏం సమాధానం చెప్పాలో బోధపడక నిశ్చేష్టుడయ్యాడు.

ఈ సన్నివేశాన్ని చూస్తున్న గ్రహాలు, భూమితో సహా మిగిలినవి ఆశ్చర్యానికి, ఆనందానికి లోనయ్యాయి.

తమలోని వేల ప్రశ్నలకు సమాధానం దొరికినట్లు సంతోషించాయి. భూమి పులకించి వానవిల్లై విరిసింది.



## కవిత

# జీవించే హక్కు కోసం ఓ కేక

◆ డా॥ కత్తి పద్మారావు
9849741695



సమాజ పరిణామం
ఉపరితలంలోనే జరుగుతోంది
మత్స్యకారులు వేటకువెళ్లి
మరణించడాన్ని
అమాత్యులు సహజ ప్రకటన చేయడం ఓ ఆశ్చర్యం
ప్రతి సముద్రం అలా
ఒక పడవ ప్రయాణ కథనాన్ని వర్ణిస్తుంది
జంతుజాతులు, వృక్ష జాతులు
ప్రకృతి నుంచి జనించి,
ప్రకృతిలో మమేకమయ్యాయి
ఏళ్ళనాడు భూమి అగ్ని గోళంగా వుంది
అనేక పరిణామాల్లో జీవజాతులు ఏర్పడ్డాయి
అన్ని జీవులకు జీవించే హక్కు సమతుల్యం
అనేక ప్రశ్నలకు సమాధానంగా
ఈ దేవుడు ఆవిర్భవించాడు
మానవుడు ఈ దేవుణ్ణి
తన చెప్పుచేతల్లోనే పెట్టుకొన్నాడు
బహురూపాల్లో చేసుకొన్నాడు
అనేక ఆహారాలు వడ్డించాడు
బలులు చేశాడు, యజ్ఞాలు,
కర్మకాండలు నిర్వహించాడు
చివరకు మనిషి తగ్గిపోయి
దేవుడు ఆధిపత్యంలోకి వచ్చాడు
నగలు, వస్త్రాలు, ఆభరణాలు,
భూములు, కానుకలు
పూజలు, సంతర్పణలు
ఒకటేమిటి?
చివరకు మెదడు కూడా దేవునికి అధీనమైంది
ఏరాయినో, రప్పనో నమ్ముకొన్న వాడికి
ఇక ఆలోచన అక్కరలేదు
ఎందుకని?
అన్నీ వాడే చూసుకొంటాడు
అంతటా వాడే వున్నాడు
ఒకనాడు నాలుగు కాళ్ళ మనిషినుండి
రెండు కాళ్ళ మనిషయ్యాడు
ఇప్పుడు రెండు కాళ్ళ నుండి
ఎనిమిది కాళ్ళ జంతువయ్యాడు
మరణం అంటే చార్వాకులు నిర్వచనం చెప్పారు
ఆ తరువాత ఏమి లేదని,

కాని మరణానంతరం జీవితం కోసమే
వీడు బ్రతుకుతున్నాడు
దెయ్యాలను, భూతాలను, భయాలను
సృష్టించుకొన్నాడు
ప్రేమని, కరుణని, ఆత్మీయతను
దునుమాడుతున్నాడు
ఆలోచనకీ అస్తిత్వానికీ మధ్య వున్న
తర్కాన్ని విడనాడాడు
తత్వశాస్త్రం కాదు మనిషికి కావలసింది
భ్రమ, మాయ అని
అందులో కొట్టుమిట్టాడుతున్నాడు
ఇంతలోనే అమ్మలు, యోగులు,
స్వాములు
పరాన్న బుక్కులు కుప్పలు తెప్పలు
మతాలు, హఠ యోగాలు
మెదడు నియంత్రణ పేరుతో
మెదడు పై పెత్తనాలు
అధీనతలు పరివ్యాప్తం
మనిషిని మనిషిగా బ్రతకనివ్వని
దేవుళ్ళు, కొల్లలు
తమకు అర్థం కాని ఉద్గ్రంథాలు
వాటిలోని చిన్న, చిన్న మాటలకు
పెద్ద పెద్ద అర్థాలు
చివరకు జీవించడం కంటే
మరణించడం మేలనే
నిర్వేదాలు, బోధనలు
తలమీద ఒక చేయి
రెండో చెయ్యి భిక్షకోసం
అడుక్కునే వాళ్ళంతా
బోధనా ప్రవచకులు

సముద్రం ఎందుకు
పొంగుతుందో తెలియదు?
తుఫాన్ ఎందుకు వస్తుందో
తెలియదు?
మరొకడేమో!
ఈ దేశమే నాదికాదంటున్నాడు
దేశానికొక దేవుడా
దేవుళ్ళకు జాతీయతా!
హద్దులా! విద్వేషాలా!
ఆయుధ సంపత్తా ! క్రూరచర్యలా!
మనిషి సామరస్యం ఎక్కడ
ఎక్కడ క్రీస్తు! ఎక్కడ కబీర్!
ఎక్కడ మానవత్వం?
మళ్ళీ మానవుడు నిద్రలేవాలి!
మతాల కతీతమైన
పరిణామ వాదాన్ని
అధ్యయనం చేయాలి
జ్ఞాన ప్రపంచాన్ని సృష్టించాలి
బెస్తవాడి మరణం సహజం కాదని
రాజ్యం అలసత్వంలో భాగమని
పుట్టిన ప్రతి మనిషికి
జీవించే హక్కు కావాలనే
ఉద్యమ ఉజ్వలనం కావాలి?
వైజ్ఞానిక యుగం ఆవిర్భావానికి
నడుం కడదాం రండి!
జీవన సౌందర్యాన్ని వికసింప చేద్దాం
అప్పుడే 'జీవించే హక్కుకు
జీవం వస్తుంది
జీవ పరిణామ వాదం
పునరుజ్జీవనం అవుతుంది

(సముద్రంలో వేటకు వెళ్ళి
తుఫానులో చిక్కుకొని మరణించిన
మత్స్యకారుల మృతికి నివాళి)






# ఖాదర్ మొహియుద్దీన్ 'పుట్టుమచ్చ' ముస్లిం మైనారిటీవాద తాత్త్వికత

షేక్. ఇబ్రహీం
◆ 9533336227

దేశ చరిత్రలో ఇరవయ్యో శతాబ్ది అంతిమ చరణం అతి కీలకమైనది. ఒక విధంగా ప్రపంచవ్యాప్తంగా నూతన సామాజిక ఉద్యమాలు వెల్లువలాగా ముందుకు వచ్చిన కాలం అది. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకూ ముస్లింలు, దళిత బహుజన బుద్ధిజీవులు ఇటు చరిత్రలోనూ, అటు కళాసాహిత్యాలలోనూ బలంగా ప్రమేయం కల్పించుకోవటం ప్రారంభించారు. **1990** లోనే పుట్టుమచ్చ కవిత రాయటం ద్వారా ఖాదర్ మొహియుద్దీన్ తెలుగులో దళిత, బహుజన చైతన్యంతో కవిత్వం రాయటానికికూడా మార్గం చూపినవారయ్యారు.

**భా**రత దేశ చరిత్రలో ఇరవయ్యో శతాబ్ది అంతిమ చరణం అతి కీలకమైనది. ఒక విధంగా ప్రపంచవ్యాప్తంగా నూతన సామాజిక ఉద్యమాలు వెల్లువలాగా ముందుకు వచ్చిన కాలం అది. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకూ ముస్లింలు, దళిత బహుజన బుద్ధిజీవులు ఇటు చరిత్రలోనూ, అటు కళాసాహిత్యాలలోనూ బలంగా ప్రమేయం కల్పించుకోవటం ప్రారంభించారు. 1990 లోనే పుట్టుమచ్చ కవిత రాయటం ద్వారా ఖాదర్ మొహియుద్దీన్ తెలుగులో దళిత, బహుజన చైతన్యంతో కవిత్వం రాయటానికికూడా మార్గం చూపినవారయ్యారు.

ప్రతి వాదానికి తనదయిన ఒక తాత్త్విక కోణం ఉంటుంది. అలాగే ఖాదర్ మొహియుద్దీన్ 'పుట్టుమచ్చ' దీర్ఘకవితకు కూడా ఒక నిర్దిష్టమైన తాత్త్విక కోణం వుంది. అలాగే స్పష్టమయిన ఒక చారిత్రక నేపథ్యం ఉంది. మన భారతదేశంలోకి అనేక మతాలు అడుగు పెట్టాయి. అలాగే ఇస్లాం మతంకూడా పాదం మోపింది. ప్రధానంగా సూఫీ గురువుల బోధనలద్వారా ఇస్లాం ఈ దేశంలోకి వచ్చింది. అది సామాజిక సమానత్వం వంటి కొన్ని అమూల్యమైన విలువలను తన వెంట తెచ్చింది. ఆ విలువలు మన సమాజానికి కొత్త విషయాలు. ఈ సమాజానికి ఎంతో అవసరమైన విలువలు. అందుకే భారతదేశంలోని సామాన్య ప్రజ ఇస్లాం మతాన్ని స్వాగతించింది. హృదయానికి హత్తుకుంది. ఇది మానవజాతి చరిత్ర చాటి చెబుతూన్న వాస్తవం. కానీ ఖడ్గంద్వారా, చక్రవర్తులు, రాజులు బలవంతంగా జరిపిన మతమార్పిడుల ద్వారా ఇస్లాం మతం ఈ దేశంలోకి వ్యాపించిందని మెజారిటీ మతానికి చెందిన ఒక వర్గం పథకం ప్రకారం ప్రచారం చేసింది, ఇప్పటికీ చేస్తున్నది. ఈ వాతావరణాన్ని ఆనాటి బ్రిటీషు వలస పాలకులు తమకు అనుకూలంగా మలుచుకున్నారు. ఈ పరిణామాలు ముస్లింల ఉనికికి పెనుముప్పుగా పరిణ మించాయి. చివరికి ఇది భారత దేశ విభజనకు దారి తీసింది.

1991లో అనగా బాబరీ మసీదు కూల్చివేతకు యేడాది ముందు ఖాదర్ మొహియుద్దీన్ రాసిన పుట్టుమచ్చ దీర్ఘకవిత ప్రధానంగా భారతదేశంలోని ముస్లింల ఉనికికి సంబంధించిన కీలకమైన అంశాలను సాంస్కృతిక రంగంలో మొదటిసారిగా చర్చకు పెట్టింది. వివిధ మతాలు, ప్రాంతాలు, భాషలు, సంస్కృతులకు నిలయమైన భారతదేశంలో కేవలం ముస్లింల ఉనికి మాత్రమే ప్రశ్నార్థకం కావటం వెనుకవున్న కారణాలను చూపించింది. ముస్లింల ఉనికి చుట్టూ తరతరాలుగా అల్లుకుపోయిన కట్టుకథలు, పుక్కిట పురాణాల వెనుకవున్న

నిజాలను, రాజకీయాలను బట్టబయలు చేయటానికి ప్రయత్నించింది. భారత ముస్లింల ఆవేదనను శక్తివంతంగా సమాజం ముందు ఆవిష్కరించింది.

భారత ముస్లింల జీవితాలకు సంబంధించిన రకరకాల పార్శ్వాలను ఎంతో సునిశితంగానూ, సున్నితంగానూ ఈ కవిత స్పర్శించింది.

ఒక కట్టుకథ నన్ను కాటేసింది/ఒక వక్రీకరణ నన్ను వంచించింది/ఒక అపనింద నన్ను అల్లరి పాల్జేసింది/ ఈ కవిత ప్రారంభ వాక్యాలివి. కవితకు ఒక బలమైన ఉపోద్ఘాతం. ఒక ప్రవేశిక. మొత్తం కవితను గనక జాగ్రత్తగా గమనిస్తే ఈ మూడు వాక్యాల సృజనాత్మక విశ్లేషణే పుట్టుమచ్చ కవిత అని మనకు స్పష్టంగా అర్థమవుతుంది. భారత ముస్లింల యదార్థస్థితికి ఈ మొదటి మూడు వాక్యాలు చాలా శక్తివంతమైన అభివ్యక్తి రూపాలు.


ఖాదర్ మొహియుద్దీన్

1955 ఆగస్టు 10 నా పుట్టిన తేదీ కృష్ణాజిల్లాలోని ఒక మారుమూల కుగ్రామం మా ఊరు అని చెప్పటం ద్వారా కవి తను ఎక్కడ నిలబడి మాట్లాడుతున్నాడో చెబుతున్నాడు. ఎందుకంటే స్థలకాలాలకు అతీతంగా ఎవరూ ఉండరు. అందుకే కవి తన స్థలకాలాలను స్పష్టం చేస్తున్నాడు. తాను స్వాతంత్ర్యానంతర తరానికి చెందిన భారతీయుడినని చెప్పుకుంటున్నాడు. దేశవిభజనతోగానీ, పాకిస్తాన్ వెళ్ళిపోవటంతోగానీ సంబంధంలేని స్థలానికి లేదా ప్రాంతానికి చెందినవాడినని కూడా చెప్పుకుంటున్నాడు.

నేను పుట్టకముందే/ దేశ ద్రోహుల జాబితాలో/ నమోదైవుంది నా పేరు / అంటున్నాడు. నిజానికి ఈ వాక్యం ఈ లఘుకావ్యానికే తలమానికం వంటిది. భారతదేశంలో ముస్లింల ఉనికి, ముస్లిం అస్తిత్వాన్ని అత్యంత శక్తివంతంగా వ్యక్తం చేసిన నిర్వచనం ఇది. తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా నిలిచిపోగలిగిన కవితావాక్యం. అంతేకాదు. ఈ దేశంలో హిందువుగా పుట్టటమే దేశభక్తికి తిరుగులేని ప్రమాణం కావటాన్నీ, ముస్లింలు తమ పుటకతోనే దేశద్రోహులుగా పరిగణింపబడటాన్నీ సవాలు చేస్తుంది. కన్నబిడ్డని సవతి కొడుకుగా /చిత్రించింది చరిత్ర/ అన్నదమ్ముల్నించి చీల్చి/ నన్ను ఒంటరివాణ్ణి చేసింది చరిత్ర

ఈ వాక్యాల ద్వారా చారిత్రక వక్రీకరణలోని నిర్దయనీ, అమానుషత్వాన్నీ స్పష్టం చేస్తున్నాడు. భారతదేశంలో ముస్లిం మాతృగర్భంలో ఇంకా రూపుదిద్దుకోకముందే భవిష్యత్తులో రూపుదిద్దుకోబోయే దేశద్రోహులుగా, మిలిటెంట్లుగా చిత్రించడంలోని అశాస్త్రీయతనీ, అన్యాయాన్నీ, అమానుషత్వాన్నీ వివరిస్తున్నాడు. భారత ముస్లింల గతాన్నీ, వర్తమానాన్నీ, భవిష్యత్తునూ ఎలా చూస్తున్నారు, ఎలా చిత్రిస్తున్నారనేది ఈ కవిత ఒక క్రమంలో వివరిస్తుంది. చివరికి తన ఇంట కన్ను తెరిచిన నవజాత శిశువు తెగ్గోసుకున్న బొడ్డు చివరి నెత్తుటి బొట్టులో 1947ని దర్శిస్తుంది వర్తమానం అంటాడు. ఈ వాక్యాల ద్వారా అసలు ఏమాత్రం తమకు సంబంధం లేకపోయినా భారతదేశ విభజన ముస్లింలను అనునిత్యం ఎలా వెంటాడుతూ వుంటుందో వివరిస్తాడు.

నా ప్రమేయం లేని పరిణామాలకు / నన్ను కర్తను చేస్తూంది వర్తమానం/ అని చెప్పడమే కాదు, మరో చోట......

వాళ్ళూ వాళ్ళూ కలిసి పంచుకున్న ఊళ్ళ మధ్య అర్ధరాత్రి పారిన నెత్తుటి యేరుతో ఏమిటీ నాకున్న అనుబంధం? అని ప్రశ్నిస్తాడు. మెజారిటీ మతస్తులలోని ఒక వర్గం ముస్లింలను అనునిత్యం అనుమాన దృక్కులతో చూడటాన్ని ఈ కవిత చర్చలోకి తీసుకువచ్చింది. ఈ అనుమాన దృక్కులు మనుషులను మానసికంగా కృంగిదీస్తాయనే వాస్తవాన్ని బలంగా స్ఫురింపజేస్తుంది.

నా నెత్తి మీద సదా /నిఘా నీడల్ని సిరేస్తుంది వర్తమానం/ హిందీ-హిందూ- హిందుస్థాన్ / ముస్లిం జావో పాకిస్థాన్/ ముసల్మాన్ కే దోహీస్థాన్/పాకిస్థాన్ యా ఖబరస్థాన్/ముస్లిం ప్రజలను నిరంతరం ఒక అభద్రతలో వుంచటం కోసం పథకం ప్రకారం చేస్తూవస్తూన్న ప్రయత్నం ఇది. పలు మతాలు, జాతులు, కులాలు, ప్రాంతాలు, భాషలున్న ఈ దేశాన్ని ఒకే ప్రజ, ఒకే జాతి, ఒకే మతంగా మార్చి తమ ఆధిపత్యాన్ని తిరుగులేని రీతిలో శాశ్వతంగా కొనసాగించాలనే కూహకం ఇది. ఒక మనిషిని వేరొక మనిషీ, ఒక జాతిని వేరొక జాతీ పీడించే సాంఘిక ధర్మం నిరంతరం కొనసాగుతూ వుండటాన్ని ఈ కవిత తనదయిన రీతిలో విశ్లేషిస్తుంది.

ఆసాంతం ఉత్తమ పురుషలో కొనసాగే ఈ కవిత తనకు వ్యతిరేకంగా రూపుదిద్దుకున్న కుట్రలు, కూహకాలను వరుసగా వివరిస్తుంది. సభ్యసమాజం వాటిని తప్పులుగా, అన్యాయాలుగా, దారుణాలుగా పరిగణించకపోవటం పట్ల తన బాధనీ, ఆవేదననీ వ్యక్తం చేస్తుంది. అదే తన విషయంలో ప్రతి అంశాన్నీ కుట్రగా చూడటంలోని అనౌచిత్యాన్నీ, అన్యాయాన్నీ ఎత్తి చూపిస్తుంది.

కేవలం నా మత విశ్వాసాలు కుట్ర/ నా సామూహిక ప్రార్థనా సమావేశాలు కుట్ర/ నేను మత్తుగా పడివుండటం కుట్ర/ నేను నలుగురితో కలసి వుండాలను కోవటం కుట్ర/నేను బతికి బట్టి కట్టాలను కోవడం కుట్ర/నా అజ్ఞానం కుట్ర, నా వెనుక బాటు తనం కుట్ర/నేను పెళ్ళాడటం కుట్ర, నేను పిల్లల్ని కనడం కుట్ర/స్వతంత్ర భారతంలో ముస్లింల సామాజిక, ఆర్థిక స్థితిగతులను వివిధ కోణాలలో ఈ కవిత ఆవిష్కరించింది. ముస్లింలు అనాదిగా అనుసరిస్తూ వస్తూన్న వృత్తులను ప్రస్తావించింది. ఆర్థికం గా, రాజకీయంగా, సామాజికంగా అడుగు ముందుకు వేయలేని స్థితిని వివరిస్తుంది.

పట్టెడన్నం కోసం/పేవ్‌మెంట్‌ల మీద పూలమ్ముకుంటాను/ పళ్ళమ్ముకుంటాను, పల్లీలమ్ముకుంటాను/గొడుగులు బాగు చేస్తుంటాను/గడియారాలు బాగు చేస్తుంటాను/వీధరుగులమీద దర్జీ పని చేస్తుంటాను/దూదేకుతుంటాను దినం గడుపుతుంటాను/ఏ గొడవల్లేకుండా /బతుకును వెళ్ళమార్చాలనుకుంటాను/ కానీ ముస్లింలంటే మొగల్ చక్రవర్తులు, నవాబులు, ధనవంతులు విలాస జీవితాన్ని గడిపేవారనే ప్రచారం జరుగుతుంది. వాస్తవ చిత్రం దీనికి పూర్తిగా విరుద్ధం. పంచవర్ష ప్రణాళికలు ఎన్ని వచ్చినా అందులో ముస్లింలకు భాగస్వామ్యం లేకుండాపోయింది. చేసేందుకు సరైన ఉపాధులు లేవు. పెట్టుబడులు లేవు. ఉన్న చోటే చిన్నచిన్న చేతి వృత్తి పనులు చేసుకుంటూ నగరాలలో జీవితాలను గడుపుతుంటారు. చదువు సంధ్యలు లేక పిల్లలు చిన్నతనం నుంచే చేతివృత్తులలో చేరుతుంటారు.

విద్యాఉద్యోగ రంగాలలోగానీ, రాజకీయ రంగంలోగానీ ముస్లింల ప్రాతినిధ్యం మరీ నామమాత్రం. జనాభాకీ, ప్రాతినిధ్యానికీ నిష్పత్తిలో ఎక్కడా పొంతన కుదరదు. అయినప్పటికీ ముస్లిం ఓటుబ్యాంకు కోసం సంతుష్టీకరణ రాజకీయాలు సాగుతున్నాయనే ప్రచారం సాగుతుంటుంది. ఎన్నికలు వస్తున్నాయంటే చాలు హిందూ ముస్లిం తగాదాలను రెచ్చగొట్టడం ద్వారా రాజకీయ లబ్ధిని పొందటం అనేది మామూలు విషయం అయిపోయింది.

**1947 ఆగస్టు 15 వ తేదీ కేవలం భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన రోజు మాత్రమే కాదు. దేశవిభజన జరిగిన రోజు కూడా. పాకిస్తాన్ వెళ్ళిపోయినవాళ్ళు అక్కడ ఏం స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తున్నారో తెలియదుగానీ భారత దేశంలోనే వుండిపోవాలని నిశ్చయించుకున్నవాళ్ళు మాత్రం తీవ్రమైన అభద్రతలోకి నెట్టివేయ బడ్డారు.**

"ఉన్నట్టుండి ఎందుకో మరి/నగరాల నడివీధుల్లో నానెత్తురు/ తీర్థస్నాన ఘట్టమవుతుంది/ఎన్నికలకు ముందు/ ఎన్నెన్నో సంఘటనల ముందు/దేశ చరిత్ర దిశా నిర్దేశానికి/నా నెత్తురు గూడు పట్టవుతుంది"

భారత ముస్లింలు ఎప్పటికప్పుడు తాము దేశభక్తులమని నిరూపించుకుంటూ ఉండాలి. దేశ స్వాతంత్ర్యం కోసం కొనసాగిన జాతీయోద్యమంలో ముస్లింలు చేసిన త్యాగాలు అసంఖ్యాకం. కాని క్రికెట్ మేచ్ దేశభక్తికి ప్రధానమైన కొలమానంగా మారింది. భారత దేశంలోని ఒక హిందువు పాకిస్తాన్ క్రికెటర్‌ని ఇష్టపడితే అది అతని ఉదార స్వభావానికి ఉదాహరణ అవుతుంది. అదే ఒక ముస్లిం గనక పాకిస్తాన్ క్రికెటర్‌ని ఇష్టపడితే అది దేశద్రోహ మనిపించుకుంటుంది. ఈ అహేతుకమైన, అన్యాయమైన, దురుద్దేశపూర్వకమైన ఆరోపణని ఈ కవిత చర్చకు తీసుకువచ్చింది.

క్రికెట్ మేచ్ నా దేశభక్తికి/ తూనికా, కొలమాన మవుతుంది/నేను నా మాతృ దేశాన్ని/ఎంతగా ప్రేమిస్తున్నానన్నది కాదు/ఏయే పరాయి దేశాల్ని /ఎంతెంతగా ద్వేషిస్తున్నానన్నదే/ నా దేశభక్తికి ఎంతో కొంత ఆధారమవుతుంది/ముస్లింలను నిత్యం సంజాయిషీలు చెప్పుకునే పరిస్థితులను కల్పించడం పంకద్బందీగా కొనసాగుతూ వస్తూన్న ఒక తెలివైన వ్యూహం.

లౌకికవాదం సైతం ముస్లింల ప్రయోజనాల కోసం రూపొందిన వాదంగానూ, వాళ్ళను వృద్ధిలోకి తీసుకు రావాలనే లక్ష్యంతోనే ఈ అంశాన్ని భారత రాజ్యాంగంలో చేర్చినట్టు సంఘ్ పరివార్ ప్రచారం చేస్తుంది. మత రాజ్యమా, లౌకిక

రాజ్యమా అనే ప్రశ్న వచ్చినపుడు మన జాతిగ నిర్మాతలు లౌకికవాదం వైపు మొగ్గు చూపారు. మత రాజ్యం అంటే దాని రాజ్యాంగం మతగ్రంధాల మీదనే ఆధారపడి వుంటుంది. దానిని మన ఇష్టం వచ్చినట్టు మార్చడం కుదరదు. ఎప్పటికప్పుడు ఆర్థిక,రాజకీయ ప్రయోజనాలకు అనుగుణంగా మార్పులు, చేర్పులు చేసుకునేందుకు వీలుగా మన రాజ్యాంగం లౌకిక స్వభావాన్ని కలిగివుండాలని భావించారు.

ఆచరణలో ప్రమేయం లేని/అక్షరాల లౌకిక భావనకి/ అన్యాయమై పోయింది ఎవరో కాదు నేనే.- వాస్తవానికి లౌకిక రాజ్యమంటే మత ప్రమేయం లేని రాజ్యం. అన్ని మతాలకు స్వేచ్ఛ, సమానత్వాలు కల్పించబడతాయి. రాజ్యానికి ప్రత్యేకంగా అధికారమతం అంటూ ఉండదు. ముస్లింలు భారత దేశంలోని శూద్రకులాల నుంచి పెద్ద ఎత్తున ఇస్లాం మతాన్ని స్వీకరించినా వారి సంస్కృతి, వారసత్వం అలానే మిగిలి ఉండటం వలన వారు మిగతా సమాజంతో కలసి నడవలేక వెనుకబడి పోయారు. రకరకాల కుల వృత్తుల్లో నిమగ్నమైపోయే నేత పని, చాకలి, దూది ఏకడం, కసాయి, కుమ్మరి, వడ్రంగి, మాలీలు మొదలగు వారు ముస్లిం సమాజంలో కనబడతారు. భారతదేశ పరిస్థితుల నేపథ్యంలో లౌకికవాదాన్ని అర్థం చేసుకోవాలంటే ముందుగా మనం నిర్మించుకున్న సమాజాన్ని ఆచార వ్యవహారాలు, మత సంప్రదాయాలను అర్థం చేసుకోవాలి.

**విద్యాఉద్యోగ రంగాలలోగానీ, రాజకీయ రంగంలోగానీ ముస్లింల ప్రాతినిధ్యం మరీ నామమాత్రం. జనాభాకీ, ప్రాతినిధ్యానికీ నిష్పత్తిలో ఎక్కడా పొంతన కుదరదు. అయినప్పటికీ ముస్లిం ఓటుబ్యాంకు కోసం సంతుష్టీకరణ రాజకీయాలు సాగుతున్నాయనే ప్రచారం సాగుతుంటుంది.**

అవును, పుట్టుమచ్చ నా ఉనికి/పుట్టుమచ్చ నా అస్తిత్వం/ పుట్టుమచ్చ నా పౌరసత్వం/నేను వూపిరి పీలుస్తూ మసలుతూన్న/ నేలా గాలి పరిసరాలూ/నాకు దఖలు పరిచిన వారసత్వం పుట్టుమచ్చ/ఎప్పటికీ మానని గాయం యీ పుట్టుమచ్చ.. చివరికి పుట్టుమచ్చనే తన జీవన శ్వాసగా మార్చుకున్న విధానాన్ని గమనించ వచ్చును. ముస్లింలు సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, దేశభక్తి, అభద్రత, అస్తిత్వానికి సంబంధించిన చట్రాలన్ని బద్దలుకొట్టి వాస్తవాల చిత్రపటాన్ని ఆవిష్కరించాడు. ఖాదర్ మోహీయిద్దీన్. ముస్లింల జీవితంలో ఉన్నటువంటి అనేక పార్శ్వాలను పుట్టుమచ్చ దీర్ఘకవిత చిత్రించింది. "పుట్టుమచ్చ మైనారిటీ కవిత్వానికి ఒక మ్యానిఫెస్టో వంటిది. కారణం అంతకు ముందు వచ్చిన విడి, విడి కవితలు ఏదో ఒక విధంగా చర్చల్లోకి వివాదాల్లోకి వచ్చినప్పటికీ వీటన్నింటికంటే భిన్నంగా అన్ని కోణాల్లోంచి సవిస్తారంగా చర్చించుకోవడానికి వీలైన ఏకైక కవిత పుట్టుమచ్చ. భారతీయ సాహిత్యంలోనే మైనారిటీ స్పృహని బలంగా వ్యక్తం చేసిన మొట్టమొదటి కవితగా దీన్ని విమర్శకులు పేర్కొన్నారు" అని చెప్పిన అఫ్సర్‌గారి మాటలు అక్షరాల సత్యం. ముస్లిం జీవితాలకు పట్టిన చెదల్ని తొలగించడానికి ఖాదర్ మోహియుద్దీన్ చేసిన కృషి గణనీయమైంది. పుట్టుమచ్చ కవిత బాబ్రీ మసీదు కూల్చివేతకు ముందు రావడం కూడా ఈ కవిత పరిధిని విస్తృతం చేసినది. ఖాదర్ మొహీయిద్దీన్ ప్రజల మనిషి కాబట్టి ముస్లిం ప్రజలతో మమేకమై, లీనమై వారి వైపు నిలబడి వారి ఆశలు, ఆశయాలు, కష్టాలు, కన్నీళు గమనించగలిగాడు. ఖాదర్ మోహియుద్దీన్ పుట్టుమచ్చలో తీసుకున్న వస్తువే కవి యొక్క సంస్కారాన్ని, సంస్కృతిని, గౌరవాన్ని, అస్తిత్వాన్ని తెలియజేసాయి.

తనకంటూ ప్రత్యేకమైన తాత్త్విక నేపథ్యం కలిగిన ఖాదర్ మొహియుద్దీన్ కవిత్వానికి ప్రజలు చూపు ఉంది. ప్రజల భాషలో రాయటం అనేది చిన్న విషయం కాదు. కవికి ఇష్టమైన పదజాలం వాడితేనే ఆ కవితకు సౌందర్యం వస్తుంది. పుట్టుమచ్చ కవిత ముస్లిమీయ తాత్త్వికతతో కొత్తపుంతలు తొక్కుతున్న ముస్లింవాద కవిత్వానికి దిశానిర్దేశం చేసి ఒక తాత్విక దిక్సూచిగా నేటికీ వర్ధిల్లుతున్నది.

ముస్లిం జీవితాలకు పట్టిన చెదల్ని తొలగించడమే కాక, ఆత్మ గౌరవాన్ని పెంచి, ముస్లిం సమాజానికి జీవనాడీగా నిలిచింది ఖాదర్‌మొహియుద్దీన్ పుట్టుమచ్చ. ఈ కవిత ఆంగ్లం, జర్మన్, హిందీ, ఉర్దూతదితర భాషాల్లోకి అనువదించ బడటమే గాదు, ఇండియాటుడే, తానా, యువభారతి, భారత్‌భవన్ (భోపాల్) లాంటి సంస్థలు రూపొందించిన ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన వంద కవితలతో కూడిన సంకలనాల్లో పుట్టుమచ్చ కవిత స్థానం పొందింది.

# నేలతల్లి పొత్తిళ్ల అంచున.....

◆ సిహెచ్. వి. లక్ష్మి
9493435649

నవ్యాంధ్ర చట్రం ప్రస్తుతం
రాజధాని ఇరుసుపై తిరుగుతోంది
క్యాపిటలిజం కౌగిలిలో
పచ్చనిపైరులు
కర్కశంగా నలిగే అంతం కోసం!

ఎటు చూసినా నిరసన గళాలు
అంబరాన్ని తాకి
అగ్ని శిఖలను గ్రక్కుతున్నాయి



పచ్చని బీడులు ఇక నీటితో తప్పనిసరై
విడాకులకు సిద్ధపడ్డాయి
గుండెలు పగిలేలా రోదిస్తూ
మట్టి వాసనల దృశ్యాల్ని తలచుకుంటూ

సుతిమెత్తని గుండెల్ని
నయవంచనతో కోస్తూ
పరదేశీయతకు
రుధిర ధారలతో అభిషేకిస్తూ
పట్టాభిషేకం చేయడం
విడ్డూరంగా లేదా?

రాజధాని మాయాజాలంలో
తుళ్లూరు రైతు బతుకును
గానుగలో పెట్టి
తిప్పుతున్నదెవరు?
దళారులకు వారసులు పుట్టడమే
నేటి ఆధునిక ధర్మసూత్రం

క్యాప్టలిజం కాండమై బలసి
కొమ్మై ఎదిగి
వికృతంగా వికసించి
విస్తరిస్తుంటే తలవంచి
అప్పగించటం తప్పుకాదు!
వంగి కొడవలిగా మారి
పదునెక్కకపోవటం
పెద్ద తప్పు

లక్ష మైలు రాయి దాటడం
లక్ష్యంగా పెట్టుకున్నా
ఒక్కో అడుగు ముందుకు
వేయాల్సిందే!

రాజధాని ఇరుసు
విరగ కొట్టడానికి ముందు
పిరికి వేర్లను పీకి వేద్దాం!
నిస్వార్థంతో జ్వలించే సూర్యుళ్లా
రైతన్నల కళ్లల్లో
వెలుగులు నింపుదాం!

రాజధాని విపణిలో రైతు నిత్యసరుకుగా
మారిన తరుణంలో
పేరిన అవినీతి కుప్పలపై
నిలబడి కరాళ నృత్యాలు
చేస్తున్న
క్యాప్టిలిజం పై ఇక
కురవక తప్పదు ఆమ్లజడి
వానలు

నాగలితో దున్నాల్సింది
భూములను కాదు
అవినీతి గుండెల్ని !

ఆత్మహత్యలు అంతర్ మధనాలు
పరిష్కారం కాదు కాదు,
ఆత్మ స్థైర్యంను పెంచుకుని
వంచన శిల్పాన్ని వధించాలి





# ప్రపంచీకరణపై ప్రతిస్పందించిన తెలుగు కవిత్వం

◆ డా॥ సూర్య ధనుంజయ్
9849104187

ప్రపంచీకరణ నేపథ్యంలో సుప్రసిద్ధ కవులు రచించిన కవితలను పాటలను ఒకచోట చేర్చి, ప్రపంచీకరణ ప్రతిధ్వనుల్ని వినిపిస్తున్న సంకలన గ్రంథమే 'ప్రపంచీకరణ ప్రతిధ్వని' ఈ రోజు ఎవరినోట విన్నా, మారుతున్న ప్రపంచం, మనమీద ప్రపంచ పరిణామాల ప్రభావం, ప్రపంచమంతా ఒక అంగడిగా మారిన వైనం మొదలైన అంశాలకు సంబంధించిన చర్చ వినిపిస్తుంది.

సాహిత్యం మీద ఎప్పుడూ ఆయా శక్తులు ప్రభావాన్ని చూపుతూనే వుంటాయి. ఆంగ్ల విద్యా ప్రభావం కావచ్చు. విదేశీ వస్తు వినియోగం కావచ్చు అవి ఏమైనా మన దైనందిన జీవితం మీద, సాహిత్యం మీద ప్రభావాన్ని చూపుతూనే ఉంటాయి.

సుప్రసిద్ధ అభ్యుదయకవి ఆచార్య ఎస్వీ సత్యనారాయణ సంపాదకత్వంలో వెలువడిన "ప్రపంచీకరణ ప్రతిధ్వని" అనే ఈ సంకలన గ్రంథం వర్తమాన జీవితాన్ని, నడుస్తున్న చరిత్రను ప్రతిబింబిస్తుంది. ఇందులోని కవితల్ని, పాటల్ని పరిశీలిస్తే వాటిని ఎన్నుకోవడంలో సంపాదకులు చూపిన చొరవ, నైపుణ్యం ఎలాంటివో మనకు తెలుస్తాయి. కవిత్వంలో వస్తున్న మార్పుల్ని ఒక విమర్శకుడుగా గమనిస్తూనే, కవిగా కాల ప్రభావానికి లోనై కవితలు రచిస్తూనే తన కాలం నాటి కవిత్వం మీద ప్రభావం చూపుతున్న శక్తుల్ని పసిగట్టడం ఆచార్య ఎస్వీ సత్యనారాయణకు మాత్రమే సాధ్యమయింది.

ఈ సంకలనంలో అరవై కవితలు, పదకొండు పాటలు కొలువు తీరాయి. కవితలు రాసిన వారిలో అనిశెట్టి రజిత, కొండేపూడి నిర్మల లాంటి స్త్రీవాద కవయిత్రులున్నారు. నందిని సిధారెడ్డి, రాధేయ, రాపోలు సుదర్శన్ లాంటి అభ్యుదయ కవులున్నారు. జ్వాలాముఖి వంటి దిగంబర కవి ఇందులో ఉండడం విశేషం. మొత్తం మీద ఈ కవులు ప్రపంచీకరణ దుష్పరిణామాలను తీవ్రంగా నిరసిస్తున్నారు. గ్లోబలైజేషన్ వల్ల మానవ సంబంధాలు మారిపోవడం ఎవరికైనా బాధాకరమే.

"గ్లోబల్ లవ్‌లో పడ్డ మనిషి/ తల్లకిందులుగా వేళ్లాడుతూ గ్లోబంతా తిరిగొస్తున్నాడు/ తోటి మనుషుల్ని ప్రేమించడం మరచి/ బిగదీసుకుపోతున్నాడు.

తల్లకిందులుగా అనడం వల్ల 'తల్లకిందులు' అనే మాట ప్రయాణానికి సంబంధించిందే కాక తన అస్తిత్వాన్ని విస్మరించాడనడాన్ని కూడా గుర్తు చేస్తుంది. జనం ఎక్కడ ఉంటే అక్కడ ఆహారోత్పత్తి జరగాలి. కాని ప్రపంచీకరణ వల్ల స్థానిక ఉత్పత్తులు అడుగంటిపోయాయి. పరాయి వస్తువుల

వ్యామోహంలో ప్రజలు పడిపోయారు. ఒక విధంగా ప్రజలు నేటివిటీని కోల్పోతున్నారని తీవ్రమైన ఆందోళనను ప్రకటించింది రజిత.

ప్రపంచీకరణ నేపథ్యం వల్ల "ప్రపంచ కార్మికులారా ! ఏకం కండి" అనే నినాదం బూడిదలో పోసిన పన్నీరైందని అన్నవరం దేవేందర్ ఆవేదన పడ్డాడు.

అరసవిల్లి కృష్ణ ఆధునాతన దుస్తుల ముందు ఆకలి కేకలతో నిలబడ్డ సామాన్య మానవుడిని దర్శించాడు. అరుణ్‌బవేరా సరళీకరణ పేరుతో గ్లోబలైజేషన్ ప్రభావానికి లోనై "నా నించి నేను పరిగెడుతున్నాను. దూరంగా నా బంగారు మట్టినించి, ఉన్న ఊరునించి, కన్నపేగు నించి" అని తన అస్తిత్వానికి మనిషి దూరమవుతున్న విధానాన్ని రూపు కట్టించాడు.

"అందరం ఒకే ఇంట్లోనే వుంటాం – పక్కపక్కనే కూర్చోనున్నా – ఒకరితో ఒకరం మాట్లాడుకోలేం." గ్లోబలైజేషన్ ఉరితాడు లాంటిది. అది మా ఇంట్లోనే వేళ్ళాడుతుందనుకోలేదుగా అని ధిక్కార స్వరాన్ని వినిపిస్తాడు ఆశారాజు. డా॥ ఉదారి నారాయణ వ్యంగ్యంగా "వేప చేదుగా లేదు! ఓహో పేస్ట్ తియ్యగుంది" అని మనల్ని ఆకర్షిస్తున్న గ్లోబలైజేషన్‌ను ఎత్తి పోడుస్తాడు. ఇది మంచి సెటైర్. ఎస్.ఆర్. భల్లం "నేలని గోలిగా మార్చే డాలర్ బూచి చాలు" అంటాడు.

ఇక ఈ సంకలనకర్త స్వయంగా కవి, విమర్శకుడు. "ఇదీ నేటి ముఖచిత్రం" అనే కవితలో ప్రపంచీకరణ వల్ల దేశీయతకు కలుగుతున్న ముప్పును తెలియచేస్తారు. "విద్య, వైద్యం, ఉద్యోగం... ఒకటేమిటి ప్రజా సంక్షేమ కార్యక్రమాలన్నీ ప్రవేటీకరింప బడుతుంటాయనీ," ప్రవేటీకరణ దుష్ప్రభావం వల్ల మనిషి గౌరవాన్ని కోల్పోతున్నాడని, అసలు మనసే స్పందించడం మానేసిందని, మానవ సంబంధాలు మార్కెటీకరింపబడ్డవని, అన్ని మూల్యాలు మూలకు వెళ్ళాయనీ, సన్మానాలు, సత్కారాలు, అవార్డులు, రివార్డులు అంగట్లో సరుకులయ్యాయనీ, అనామక యువతి "ఉమెన్ ఆఫ్ ది ఇయర్"గా పత్రికలకు పతాక శీర్షిక అవుతుందనీ, ప్రపంచబ్యాంకుదే పెత్తనమనీ ఆచార్య ఎస్వీ సత్యనారాయణ గారు దుష్పరిణామ వివరాలను సామాజిక దార్శనికతతో తమ కవితలో పొందుపరిచినారు.

ప్రపంచీకరణ ప్రభావానికి మనం స్వంత ఊరిని, సొంత వాడను వెదుక్కోవలసిన అవసరం ఏర్పడిందనీ నాగభూషణాచార్య పలుకగా, "వాడొక అందమైన దయ్యం, మనల్ని చుట్టు ముట్టే విషవాయువు" అని ప్రపంచీకరణని దుయ్యబట్టాడు. డా॥ కలువగుంట రామమూర్తి, గ్లోబలైజేషన్‌కు బలైపోవద్దని హెచ్చరించాడు. "అమ్మలకూ బొమ్మలకూ భేదం తెలియని" దుస్థితిని ఆయన ఎత్తి చూపాడు. మన డ్రస్సు మారిపోయింది. అడ్రస్సు మారిపోయిందని హెచ్చరించాడు. కందుకూరి శ్రీరాములు కవిత మనల్ని బాగా ఆలోచింపచేస్తుంది.

**డా॥ కలువగుంట రామమూర్తి, గ్లోబలైజేషన్‌కు బలైపోవద్దని హెచ్చరించాడు. "అమ్మలకూ బొమ్మలకూ భేదం తెలియని" దుస్థితిని ఆయన ఎత్తి చూపాడు. మన డ్రస్సు మారిపోయింది. అడ్రస్సు మారిపోయిందని హెచ్చరించాడు. కందుకూరి శ్రీరాములు కవిత మనల్ని బాగా ఆలోచింపచేస్తుంది.**

"నిన్నటిదాకా బొమ్మల్తో ఆడుకునేది/ చిన్న పిల్లలనుకున్నాం/ఇవాళ / పెద్దవాళ్ళను సైతం/చిన్నపిల్లల్ని చేసి ఆడించటం/మొదలైంది/ ఈ పంక్తులు నిర్దాక్షిణ్యంగా ప్రపంచీకరణకు లోనైన మన కుటుంబ వ్యవస్థను కళ్ళముందు నిలుపుతుంది.

కొండేపూడి నిర్మల కవిత "జీవితం వర్సెస్ ట్రూప్ బజార్" సహజత్వానికి దూరంగా కృత్రిమ జీవితానికి అలవాటుపడ్డ విధానాన్ని తెలియచేస్తుంది.

"ఒక పింగాణీ అట్టహాసం/ ఒక ప్లాస్టిక్ డబాయింపు ఒక లోహపు దమదమ/మనుషుల్ని తరిమి కొడుతున్న మార్కెట్లో/మానవ విలువలు తక్కెడలో వున్నాయి/కొంటారా? అమ్ముతారా?/అంటూ తన ఆక్రోశాన్ని వెలిబుచ్చింది

రూపాయ వన్నె తగ్గి డాలర్‌కు రెక్కలొచ్చి తన ప్రతాపాన్ని చూపెడుతుందని ఉదయబాబు 'డాలర్ ఖడ్గం' అనే కవితలో రాశాడు. "పరాయితనం, పచ్చని బ్రతుకుల్లోకి పరకాయ ప్రవేశం చేసి అందరిని హిప్నటైజ్ జీవుల్లా మార్చేసిందని ఆవేదన చెందాడు. కోసూరి గాంధీ ఈ నేపథ్యాన్ని వివరిస్తూ "భూమి మీద బడుగు జీవితాలన్నీ, డాలరు వలలో చిక్కిన చేప పిల్లలే" అని గ్లోబలైజేషన్ వేటకానితనాన్ని బహిర్గతం చేశాడు. పల్లెలే కాదు నగరాలు మారిపోతాయని, 'ఎర్రజీరలు'

అనే కవిత ప్రబోధిస్తుంది. "వాడి గ్లోబలైజేషన్ పైపు"లోకి నెట్టుకోవాలని కలలు కంటున్నాడు....... ఎరుపు ఎంత సజీవమైందో వాడి కంప్యూటర్ స్క్రీన్‌కేం తెలుసూ... వాడి వెబ్‌సైట్‌లో సైబరాబాదులూ.... ఫ్లైఓవర్లూ తప్ప... బషీర్‌బాగ్ చౌరస్తాలోకి నడిచొచ్చే కరెంటు స్తంభాలు ఉండవు."

చింత దేవేందర్ మువ్వన్నెల జాతీయ జెండా ముడుచుకపోయిన చిత్రాన్ని కళ్లకు చూపిస్తాడు. దేశం కరెన్సీని డాలర్ల దేగ తన్నుకపోతుంది. – అని చిమ్మపూడి శ్రీరామమూర్తి అభిప్రాయపడగా, జొన్నవిత్తుల అనే కవి అమెరికవాడు ప్రపంచీకరణ నేపథ్యంలో అన్ని దేశాల సంస్కృతులను హారతి కర్పూరం చేశాడని కనుమరుగవుతున్న దేశదేశాల సంస్కృతి విలువలను గురించి సూటిగా తన అభిప్రాయాన్ని తెలియచేశాడు.

**గ్లోబలైజేషన్ కారణంగా ఎక్కడ చూసిన ప్లాస్టిక్ పూలే అగుపించడంతో నందిని సిధారెడ్డి "బతుకమ్మ పండుక్కి తంగెడు పువ్వు దొరక్క తబుకు చిన్నవోతుంది. దసరా హుషారులో జెండా కింద జొన్నకర్ర దొరకక ఊరు నిట్టూరుస్తుంది" అని పల్లె సంస్కృతిని కళ్లముందు నిలిపాడు.**

ఇక దిగంబరకవి జ్వాలాముఖి డాలర్‌ను దేగతో పోలుస్తూ, దేగను సేవించే స్వచ్ఛంద చిలుకలు ఎన్ని ఉన్నా; డాలరు తిరునాళ్ళలో కష్టజీవి బిచ్చగాడు కాలేదని, ఉనికి పోరాటం ఆపలేదని తన ఆశావాద దృక్పథాన్ని బలంగా చాటుకున్నాడు. గ్లోబలైజేషన్ కారణంగా ఎక్కడ చూసిన ప్లాస్టిక్ పూలే అగుపించడంతో నందిని సిధారెడ్డి "బతుకమ్మ పండుక్కి తంగెడు పువ్వు దొరక్క తబుకు చిన్నవోతుంది. దసరా హుషారులో జెండా కింద జొన్నకర్ర దొరకక ఊరు నిట్టూరుస్తుంది" అని పల్లె సంస్కృతిని కళ్లముందు నిలిపాడు.

డా॥ నాళేశ్వరం శంకరం నాణానికి నాణానికి ఉన్న సంబంధమే మానవ సంబంధమని వ్యంగ్యంగా చెప్పాడు. తరతరాల తలరాతలు చెరిగిపోయిన కాలమిది, అని మిర్యాల రామకృష్ణ సృష్టికర్తకు ఉత్తరమే రాశాడు. దాస్యం లక్ష్మయ్య 'తస్మాత్ జాగ్రత్త' అని మనకు సందేశమిస్తాడు. షేక్ కరీముల్లా గరీబు దేశాల్ని, కబాబు ముక్కల్లా చప్పరిస్తున్న తెల్లోడి తెంపరితనం మనకొద్దంటాడు.

ఇక పాటల్లో గద్దర్ పాట హైలెట్. అమెరికోడోస్తుండో! సిగరెట్టయి వచ్చి సిగముడి పట్టుకుండూ అంటాడు. పంటలకు నూనె అయి వంటింట్లో కొచ్చిండని వ్యంగ్య బాణాలు సంధిస్తాడు. బాంబుల సంచులతోని బంధూకులు లోడుచేసి, తల్లీ భారతి ఎదలమీదా పాదాలు మోపిండని కలత చెందాడు.

"బాలసెంద్రుని లాంటి – కాలేజీ కుర్రోల్ల బతుకుల్లో బ్రౌన్ షుగరై – నరాల్లో మత్తు మందై చిగిరించే కొమ్మలను చిదిమేసి పోతుండు. సూడండని దేశానికి భవితలైన యువత గురించి వేదన చెందాడు.

గోరటి వెంకన్న పల్లె కన్నీరు పాట ప్రపంచీకరణ నేపథ్యంలో పల్లెజీవులు పడుతున్న కష్టాలను ఏకరువు పెడుతుంది

"పల్లె కన్నీరు బెడుతుందో – కనిపించని కుట్రల /తల్లీ బందీయై పోతుందో కనిపించని కుట్రల/ కుమ్మరి వాములో తుమ్మలు మొలిచెను/ కమ్మరి కొలిమిలో దుమ్ము లేచెను/సాలెల మగ్గము నడుగు లిరిగినయి/పెద్ద బాడిషా మొద్దుబారినది"

అని చేతివృత్తులు ఎక్కడా పల్లెల్లో కనిపించట్లేవనీ, గ్రామ స్వరాజ్యం అంతా గంగలో మునిగిందని ఆందోళన చెందాడు.

అమ్మలారా! రండి – అమెరికోడు వొస్తడంట
హారతి బట్టండి – బుష్‌దొరడాగొస్తున్నడంట

అని ఎస్వీ సత్యనారాయణ తన వ్యంగ్య బాణాలను సంధించాడు. మనదేశ సంస్కృతి మనుగడను కోల్పోయిందనీ, మన భాషలు మన యాసలు మట్టిలో కలిశాయని, క్రూర నేర విష సంస్కృతి మనపై రుద్దబడుతుందని తన ఆవేదనను హైటెక్ గీతంలో ప్రకటించాడు.

నందిని సిధారెడ్డి "పూల పూల తోట లోపల' అనే గేయంలో తాత తండ్రుల వారసత్వం తరలిపోయిందని, ఇంగిలీసు మందులొచ్చి మనిషి బలమును తగ్గించాయనీ, పచ్చటి నేలతల్లి పగులుబారి పోయిందనీ, అందమైన వనం చుట్టూ ముళ్లకంచెలు పడి అప్పులపాలు అవుతున్న రైతుల పరిస్థితిని కళ్లకు కట్టించాడు.

ఈ విధంగా ఆచార్య ఎస్వీ సంపాదకత్వంలో ఒక ప్రత్యేకమైన రీతిలో ప్రపంచీకరణ ప్రతిధ్వని వెలువడింది. విశాలాంధ్ర వారు అనితర సాధ్యమైన ఒక సంకలనాన్ని తీసుకొని రావడం సాహిత్యానికి ప్రయోజనమే అని నా భావన.



# శ్రమ జీవన మహాపతాకం

◆ సిరికి స్వామినాయుడు
9494010330

మామూలు మట్టిమీద మంత్రించిన చెమటను చల్లి
మహత్తర హరితప్రపంచాన్ని ఆవిష్కరిస్తారు – వాళ్లు !
చెమటచమురుతో వెలుగుతూ....
లోకంమీద వెలుగులు పరిచే పుడమిదీపాలు – వాళ్లు!
శ్రమ – వాళ్లకొక బలహీనత!
బండను దొర్లించినట్టు ఎక్కడో దొరికిన గింజను
పుట్టలోకి దొర్లించే చీమల్ని చూడు!
ఏరితెచ్చిన చిదుగులతో
గూడుకట్టుకునే పక్షుల్ని చూడు!
ప్రకృతే శ్రమకు మూలాధారమైనపుడు
శ్రమను ప్రేమించడమంటే... ప్రకృతిని ఆరాధించడమే!
ప్రకృతిని ఆరాదించిన వాడు
శ్రమని ప్రేమిస్తాడు
చెమటబిందువులో..
సమస్తలోకాన్ని దర్శించుకుంటాడు!
శ్రమజీవి పాదాలకిందింత మట్టిన
విబూదిలా నొసట దిద్దుకుంటాడు!
శ్రమజీవన మహాపతాకానికి చేతులెత్తిమొక్కుతాడు!



నాట్లు వేసేటపుడో... గాబు తీసేటపుడో...
హరివిల్లులా వంగే కష్టజీవి
కళ్లల్లో కన్నీటిమడుగుల్ని చూసినవాడు,
బస్తాలు వీపునమోసి బండిపైరానికెక్కించేటపుడు
వాడి వీపున
అస్తమయ సూర్యబింబాల్ని చూసినవాడు,
శ్రమంటే...
చెమటపరిమళాల అనంతానంత సౌందర్యమంటాడు!
సృష్టిని తన అలల మీద వోలలాడించే సముద్రమంటాడు!

భూగోళం మీద మూడొంతులు నీరున్నది నిజమైతే
అది శ్రమజీవులు చిందించిన స్వేదమే!
శ్రమ లేని చోట సంపదనూహించలేం!
శ్రమసౌందర్యంలేని ప్రపంచం ఒక స్మశానం!
విలయమొస్తుంది! అంతా నేలమట్టమైపోతుంది!
మళ్లీ శ్రమతోనే వాటిని పునఃప్రతిష్టించుకోవాలి!
శ్రమతోనే నగరాలు నిర్మితమౌతాయి
నాగరికతలు నిర్మితమౌతాయి!
చెమటబిందువు భూగోళమై దర్శనమిస్తుంది!
శ్రమించకుండా... చెమట చిందించకుండా...
అయాచితంగా వచ్చేది వరదనీరే...!

ఎక్కడ స్వేదనదులు ఉప్పొంగుతాయో...
అక్కడ నేల, సస్యరాగాలు ఆలపిస్తుంది!
ఎక్కడ, చెమటపిట్టలు స్వేచ్ఛగా సంచరిస్తాయో....
అక్కడ నరతోటమీద, నిండువసంతం పరుచుకుంటుంది!
అక్కడ శ్రమజీవుల పొత్తిళ్లలో... భూగోళం
పసిపాపలా కేరింతలు కొడుతుంది!!

# గులాబీముల్లు



◆ ఎమ్వీ రామిరెడ్డి
9866777870

"రండి రండి. ఈ క్షణము కోసమే నా నిరీక్షణము" అప్పుడే ఆఫీసులోకి ప్రవేశించి, తన సీటులో కూచోబోతున్న వసుంధరను ఆనందంగా ఆహ్వానించాడు కారుణ్య.

"అంటే, ఈరోజు తమరు టిఫిన్ చేసి రాలేదన్నమాట" నవ్వుతూ అడిగింది వసుంధర.

"హహ్హహ్హహ్హా... అంతేగదండీ..." నవ్వుతూనే సమాధానమిచ్చాడు కారుణ్య. అతను సహోద్యోగి. బ్రహ్మచారి. ఉదయం ఉపాహారం తీసుకోకుండా ఆఫీసుకు వచ్చిన రోజు వసుంధర రాకకోసం ఎదురు చూస్తాడు. ఆమె లంచ్‌తోపాటు రోజూ ఏదో ఒక స్నాక్స్ తెస్తుంది. వాటితో బ్రేక్‌ఫాస్ట్ బెంగ తీర్చుకోవడం అతనికి ఆనవాయితీగా మారింది.

"నీ అదృష్టం. ఈరోజు పులిహోర తెచ్చాను. ఇదిగో లాగించెయ్".

ఆమె చేతుల్లోంచి బాక్సు అందుకుని, తన టేబుల్ మీద పెట్టుకుని, తినడం ప్రారంభించాడు కారుణ్య.

"ఆహా, మీకు ఎంత ఓపిక మేడమ్! ఇద్దరు పిల్లల్ని రెడీచేసి, అన్నమూ రెండు కూరలూ తయారుచేసి, వారికి బాక్సులు పెట్టి, మీరు బాక్సు పెట్టుకుని... ఇంకా పులిహోర కూడానా? మీకసలు టైమెలా సరిపోతుంది?" తింటూనే ఆశ్చర్యంగా అడిగాడు కారుణ్య.

"మా వారు సాయం చేస్తారు".

"అదృష్టవంతులు".

"ఇంతకీ పులిహోర ఎలా ఉంది?"

"అదుర్స్".

అదో స్వచ్ఛందసంస్థ కార్యాలయం. ఎక్కువమంది ఉద్యోగులు ఫీల్డులో ఉంటారు. పదిమంది మాత్రమే ఆఫీసులో పనిచేస్తారు. వసుంధర సీనియర్ అకౌంటెంటు. కారుణ్య జోనల్ కో-ఆర్డినేటర్. పదిమందీ ఒక కుటుంబంలా ఉంటారు. ఆడుతూ పాడుతూ పని చేసుకుంటారు. టార్గెట్లను ఛేదించాల్సిన ఒత్తిళ్లుండవు. ఆఘమేఘాల మీద పూర్తి చేయాల్సిన ప్రాజెక్టులుండవు. ఇంటికి తీసుకెళ్లాల్సిన ఫైళ్లుండవు. ఆఫీసులో ఉన్నంతసేపు ఎవరి పనిలో వాళ్లు పూర్తిగా నిమగ్నమవుతారు. కలిసి భోంచేస్తారు. ఒకరింటికి మరొకరు

వెళ్తారు. ఫంక్షన్లకు పిలచుకుంటారు. అలాంటి సంస్కృతిని అలవాటు చేసిన ఘనత వాళ్ల బాస్ నందకిషోర్‌దే.

వసుంధర అందంగా ఉంటుంది. ఇద్దరు కొడుకులు. పెద్దవాడు పదో తరగతి, రెండోవాడు ఏడు. నలభైకి దగ్గర్లో ఉన్నా, ఇంకా పాతికేళ్ల ప్రాయంలోనే ఉన్నట్లు కనిపిస్తుంది. ఆఫీసులో అందరూ 'సంతూర్ మమ్మీ' అంటూ ఆట పట్టిస్తారు.

మధ్యాహ్నం ఒకటిన్నర. అందరూ ఒకచోట కూడి, లంచ్‌బాక్సులు తెరిచారు. ఒకరి కూరలు మరొకరు పంచుకున్నారు.



"గృహప్రవేశం ఎలా జరిగింది సార్?" బాస్‌వైపు చూస్తూ అడిగింది వసుంధర.

"బాగా జరిగిందమ్మా" తింటూనే జవాబిచ్చాడాయన. అంతకుముందు రోజే వాళ్లంతా విజయవాడ వెళ్లొచ్చారు, ఒక ఉద్యోగి అక్కడ ఇల్లు కొనుక్కున్నాడు.

"అంత సింపుల్‌గా చెబుతారేం సార్? అసలు కృష్ణానది ఒడ్డున ఎంత ఎంజాయ్ చేశాం! వసుంధర మేడమ్ మళ్లీ ఒక అద్భుతమైన అనుభవాన్ని మిస్సయ్యారు" ఊరిస్తూ చెప్పాడు కారుణ్య.

"ఏం ఫర్వాలేదు. మీరు ఎంజాయ్ చేస్తే, నేనూ చేసినట్లే" తేలిగ్గా కొట్టిపారేస్తూ అంది వసుంధర.

"అలా ఎలా అవుతుంది మేడమ్? అయినా ఎందుకని, అన్ని ఫంక్షన్లూ పనిగట్టుకొని ఎగ్గొడతారు మీరు?"

"నీకేం, బ్రహ్మచారివి. ఎన్నయినా చెబుతావు. సంసారబాధ్యతలు మీద పడితే అప్పుడు తెలుస్తుంది".

"అబ్బా! మరి లలిత మేడమ్, రుక్మిణి మేడమ్, వనజ మేడమ్‌లకు కూడా పెళ్లిళ్లయ్యాయి. వాళ్లు ఎంచక్కా మాతోపాటు రాలేదా?"

"అలా అనకు కారుణ్యా. ఆమె ఇబ్బందులేవో ఆమెకుండి ఉంటాయి" బాస్ మద్దతు పలికాడు.

"ఊరుకోండి సార్, మీకు మరీ దయాదాక్షిణ్యాలు ఎక్కువ. ఆ ముగ్గురు మేడమ్‌ల ఇళ్లల్లో వాళ్ల భర్తలు పైసా పనిచెయ్యరు. వసుంధర మేడమ్ వాళ్లాయన ఎంచక్కా బోల్డన్ని పనులు చేసిపెడతాడట. అలాంటప్పుడు అందరితో కలిసి రావడానికి ఏమైంది?"

"నెక్స్ట్‌టైమ్ ఎవరింట్లో ఫంక్షన్ జరిగినా గ్యారంటీగా వస్తా. సరేనా" అంది వసుంధర, కారుణ్య వైపు చూస్తూ.

"ఇంకేం వస్తారు? మన కొలీగ్స్‌కు సంబంధించిన పెళ్లి, శ్రీమంతం, గృహప్రవేశం ఫంక్షన్లన్నీ అయిపోయాయి. ఇంకేం మిగిలాయని..."

"నీ పెళ్లి ఉందిగా..." బాస్ అందుకున్నాడు.

"దానికింకా రెండేళ్లు టైముంది సార్. అఫ్‌కోర్స్, అప్పుడు కూడా సంతూర్ మేడమ్ ఎగ్గొట్టడం గ్యారెంటీ అనుకోండి..."

అందరూ నవ్వేశారు.

ఆరోజు వనజ పుట్టినరోజు. ఆఫీసులో ఎవరి పుట్టినరోజైనా బాస్ కేక్ తెప్పించడం ఆనవాయితీ.

సాయంత్రం ఆఫీసు అయిపోయాక, అందరూ హాల్లో సమావేశమయ్యారు. వనజ కేక్ కట్‌చేసి, అందరికీ సర్వ్ చేసింది.

ఒక్కొక్కరూ వనజతో తమ స్నేహం గురించి నెమరు వేసుకున్నారు. ఆమె సద్గుణాలను ప్రశంసించారు. ఒకరిద్దరు వనజలో రావాల్సిన మార్పుల గురించి ప్రస్తావించారు. చివరికి బాస్ మాట్లాడుతూ కొత్తగా చేపట్టబోతున్న 'హెచ్‌ఐవీ అవేర్‌నెస్ ప్రాజెక్టు' బాధ్యతల్ని వనజకు అప్పగించాడు. అది ప్రమోషన్ కన్నా ఎక్కువ.

* * *

రోజూకన్నా గంటన్నర ఆలస్యంగా ఇంటికి చేరుకుంది వసుంధర. ఆటోలో బయలుదేరిన దగ్గర్నుంచీ ఆమె గుండె వేగం హెచ్చింది. భయం భయంగా ఇంట్లో అడుగు పెట్టింది. ఊహించినట్లుగానే ఎదురుగా సోఫాలో కూచొని, గుడ్లురిమి చూస్తున్నాడు ఆమె భర్త శంకర్.

"నమస్కారం మేడమ్, నా పేరు శంకర్. మీ ఆయన్ని. మనకు ఇద్దరు పిల్లలున్నారు. గుర్తుందా?" వ్యంగ్యంగా అడిగాడు భర్త.

"అది... ఆఫీసులో ఒకమ్మాయి బర్త్‌డే అయితే..." నసిగింది వసుంధర.

"చేసుకుంటారు మేడమ్. మీరు బర్త్‌డేలూ వెడ్డింగ్‌డేలూ చేసుకుంటారు. కేకులూ స్వీట్లూ తింటారు. ఎంజాయ్‌మెంట్‌లో మునిగి తేలతారు. ఇక్కడ పిల్లలే అల్లాడతారు..."

'వాళ్లేమన్నా పసిపిల్లలా, వాళ్ల పని వాళ్లు

చేసుకుంటారులే...' లోపల్లోపల గొణుక్కుంటూ వానిటీబ్యాగ్ మంచం మీద విసిరేసి, లంచ్‌బాక్స్‌ను సింక్‌లో పడేసి, డ్రెస్ మార్చుకుని, హడావుడిగా పనిలో నిమగ్నమైంది వసుంధర.

"నేనిక్కడ నా మానాన నేను గొంతు చించుకుంటున్నా నీకు చీమ కుట్టినట్లయినా లేదా..." ధ్వని పెంచాడు శంకర్.

"చెప్పండి, టీ పెట్టమంటారా?"

"ఆహా, ఏమి నా భాగ్యం. రెండు గంటల నుంచీ ఎదురు చూస్తున్నా. కనీసం అదన్నా నా మొహాన తగలబెట్టు..."

చకచకా స్టౌ వెలిగించి, టీ రెడీ చేసి, కప్పు భర్తకు అందించింది. టీ తాగి, తలుపు విసురుగా వేసి, బయటికెళ్లిపోయాడు భర్త.

రాత్రి పిల్లలిద్దరికీ భోజనం వడ్డించి, వారిని పడుకోబెట్టింది. పదకొండు గంటలదాకా చూసినా భర్త జాడలేదు. తనూ భోంచేసింది. అర్ధరాత్రి కావస్తోంది. చూసీచూసీ, ఇక పడుకుందామని లైటు తీయబోతుండగా, కాలింగ్‌బెల్లు మోగింది.

శంకర్ వచ్చాడు. బాగా తాగి ఉన్నాడు. భోజనం వడ్డించింది.

"కొత్త బిజినెస్ స్టార్ట్ చేస్తున్నా..." ముద్ద నోట్లో పెట్టుకుంటూ అన్నాడు శంకర్.

"ఏంటది?"

"ట్రాన్స్‌పోర్టు బిజినెస్..."

"పెట్టుబడి ఎంతవుతుంది?"

"పది లక్షలు"

"ఎక్కడ తెస్తారు?"

"నీకెందుకే? నువ్వేమన్నా తెచ్చిపెడతావా? నా చావు నేను ఛస్తాలే..." తల్లిలేని పిల్ల అని కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకోవడమే తాను వసుంధరకు చేసిన మహోపకారం అనేది శంకర్ నిశ్చితాభిప్రాయం.

"అది కాదండీ, ప్లాస్టిక్ తయారీ కంపెనీ అని పెట్టారు. పదిహేను లక్షల నష్టం వచ్చింది. ఆ అప్పే తీరలేదు. మనకు బిజినెస్ అచ్చివచ్చేలా లేదు. దానికన్నా శుభ్రంగా మీరు కూడా ఏదైనా జాబ్‌లో చేరితే..." అర్థోక్తిలో ఆగింది వసుంధర.

అప్పటికే అయిదారు చిరువ్యాపారాలు చేసి, అన్నిట్లో నష్టం చవిజూసి ఉన్నాడు శంకర్. దాని గురించే భార్య ఎత్తిపొడుస్తోందని భావించి, పళ్లెన్ని ఒక్క తన్ను తన్నాడు.

"ఇప్పుడు నేనేమన్నాననండీ..." ఆమె మాటలు వినిపించుకోకుండా ఆగ్రహంతో అంతెత్తున లేచి, వసుంధర మీద విరుచుకుపడ్డాడు.

* * *

"వనజా, వసుంధరకేమైనా ఫోన్ చేశావా?" ఆరోజు లంచ్ టైములో అడిగాడు నందకిషోర్.

"లేదు సార్".

"ఇవాళ్టికి నాలుగు. ఇన్నిరోజులు ఎప్పుడూ ఆమె సెలవు పెట్టదే!" ఆశ్చర్యంగా అడిగాడు.

"జ్వరం అని ఎస్సెమ్మెస్ పంపింది కదా సార్" ప్రస్తావించాడు కారుణ్య.

"ఇన్ని రోజులా! పాపం, ఎలా ఉందో ఏమో! వనజా, సాయంత్రం ఓసారి వసుంధర గారింటికి వెళ్లిరాకూడదూ..."

"అలాగే సార్" చెప్పింది వనజ.

తలుపు చప్పుడైంది. "ఎవరదీ, ప్లీజ్ కమిన్.." నందకిషోర్.

అందరి చూపూ అటువైపు మరలింది.

''నేనే సార్...'' అంటూ నవ్వుతూ భాస్కర్ లోపలికొచ్చాడు. అతను గతంలో ఇదే ఆఫీసులో పనిచేశాడు. టాటా కన్సల్టెన్సీలో అవకాశం రావడంతో గత నెలలోనే ఇక్కడ మానేశాడు.

"హాయ్... ఎలా ఉన్నావ్?" దాదాపు అందరూ ఒక్కసారే అడిగారు.

"చాలా బాగున్నాను" నవ్వుతూ చెప్పాడు.

"కొత్త ఉద్యోగం ఎలా ఉంది?"

"చాలా చాలా బాగుంది. అక్కడ కూడా నందకిషోర్ సార్ లాగే మంచి బాస్ దొరికాడు..."

"ఏమిటోయ్ విశేషం, హఠాత్తుగా మేం గుర్తొచ్చాం?" నందకిషోర్ అడిగాడు.

"విశేషమే సార్. వచ్చే నెల అయిదో తేదీ నా పెళ్లి, వైజాగ్‌లో. మీరందరూ తప్పకుండా రావాలి" చేతుల్లోని శుభలేఖలు చూపిస్తూ చెప్పాడు.

"హోహోయ్. మా ఆఫీసు కాదు; మా మనిషివి కాదు.

మేమెందుకు రావాలి? టైం వేస్ట్" నవ్వుతూ అన్నాడు నందకిషోర్.

"మీరలా అంటారనే, రెండో శనివారం నాడు పెళ్లి పెట్టుకున్నా. మరుసటిరోజు ఆదివారం. కాబట్టి, ఇక నా పెళ్లికి ఎగ్గొట్టడానికి ఎవ్వరికీ ఎలాంటి కారణాలూ లేనట్లే" స్థిరంగా చెప్పాడు భాస్కర్. పేరుపేరునా అందరికీ శుభలేఖలు పంచి, ఓ అరగంట తర్వాత వెళ్లిపోయాడు.



భాస్కర్ మంచి మాటకారి. తెలివైన వాడు. ఆఫీసు తలలో నాలుకలా ఉండేవాడు. ఎవరే పనిచెప్పినా విసుక్కోకుండా చేసేవాడు. అందుకే, అతని పెళ్లికి అందరూ వెళ్లాలని తీర్మానించారు.

* * *

సాయంత్రం ఏడుగంటల సమయంలో వసుంధర వాళ్లింటి కాలింగ్ బెల్లు నొక్కింది వనజ.

వసుంధర చిన్నకొడుకు తలుపు తీసి, వనజను గుర్తుపట్టి, "రండి ఆంటీ" అంటూ ఆహ్వానించాడు.

"అమ్మేదీ?" అడిగింది వనజ.

"బట్టలు తీసుకురావడానికి పైకెళ్లింది. కూచోండి, వచ్చేస్తుంది" గ్లాసుతో మంచినీళ్లు అందిస్తూ చెప్పాడు.

సోఫాలో కూచుంది వనజ. నాలుగు నిమిషాల తర్వాత వాటెడు బట్టలతో వచ్చింది వసుంధర. వనజను చూడగానే కంగారు పడింది. అయితే ఆ సమయంలో భర్త ఇంట్లో లేనందుకు ఊపిరి పీల్చుకుంది.

బట్టలు బెడ్‌రూములో పడేసి, దగ్గరగా వచ్చిన వసుంధరను చూడగానే వనజ గతుక్కుమంది. రెండు చేతులమీదా గాయాలు. కుడి కంటికి పైన రక్తం గడ్డకట్టిన చారికలు.

"ఏమైందే..." ఆందోళనగా అడిగింది వనజ.

"అబ్బే, ఏం లేదు. బాత్‌రూములో పడ్డాను" అబద్ధం చెప్పింది వసుంధర.

"ఈ దెబ్బలు అలా లేవే" అనుమానంగా అడిగింది వనజ.

"ఊరుకోవే, నీకన్నీ అనుమానాలే. ఉండు, టీ తెస్తా" వంటింట్లోకి వెళ్లింది వసుంధర.

వనజ పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది.

వసుంధర ఒక కప్పు వనజకిచ్చి, రెండోది తను తీసుకుంది. ఆఫీసు గురించి అడిగింది వసుంధర. భాస్కర్ పెళ్లి గురించి చెప్పింది వనజ. ఇద్దరూ టీ తాగుతూ కబుర్లలో పడ్డారు.

ఇక వెళ్లొస్తానని వనజ లేస్తుండగా, శంకర్ ఊడిపడ్డాడు, చేతిలో స్వీట్‌ప్యాకెట్‌తో.

"ఎలా ఉన్నారు మేడమ్? పిల్లలు బాగున్నారా?" నవ్వుతూ పలకరించాడు వనజను.

''అంతా క్షేమమేనండీ...'' బదులిచ్చింది వనజ.

"రాకరాక మీ ఫ్రెండ్ ఇంటికి వస్తే, ఒట్టి టీ ఇచ్చి పంపుతావా? ఇవిగో స్వీట్లు పెట్టు" స్వీట్‌ప్యాకెట్ వసుంధరకు అందిస్తూ చెప్పాడు.

'వసుంధర ఎంత అదృష్టవంతురాలో' అనుకుంది వనజ, తరచూ వసుంధర తన భర్తను పొగుడుతూ చెప్పే మాటలు గుర్తుకొచ్చి.

ముగ్గురూ పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. భర్త అసలు స్వరూపం ఎక్కడ బయటపడుతుందోనని లోపల్లోపల భయంతో వణికిపోతోంది వసుంధర.

"వసు లేకపోతే ఆఫీసంతా బోసిపోయినట్లుంటది అంటున్నాడు మా బాస్" నవ్వుతూ చెప్పింది వనజ.

శంకర్ పెద్దగా నవ్వేసి, "పాపం, ఇష్టమైన మనిషిని చూడకుండా ఉండలేకపోతున్నాడనుకుంటా'' అనేసి, అక్కడినుంచి లేచి, బెడ్‌రూములోకి వెళ్లాడు. ఆ నవ్వులో అపశ్రుతులు ధ్వనించాయి.

వనజ అయోమయంగా వసుంధర వైపు చూసింది.

ఇంతలోనే శంకర్ పెద్దగా అరుస్తూ హాల్లోకి వచ్చి, "బుద్ధుందా! బట్టలన్నీ చిందరవందరగా బెడ్‌మీద పడేస్తావా? ఆఫీసుగ్గూడా తగలట్టం లేదుగా. ఏం ఘనకార్యాలు వెలగబెడుతున్నట్టు..." కళ్లింత జేసి గాండ్రించాడు.

"లేదండీ, ఇప్పుడే పైనుంచి తెచ్చా. మడతేస్తా..."

"అఘోరించావులే. నా మొహాన కాసిని టీనీళ్లు పొయ్" ఆజ్ఞ జారీచేసి, బాత్‌రూములో దూరాడు.

వనజకు పరిస్థితి అంతా అర్థమైంది.

"ఆయన కొంచెం చికాకులో ఉన్నట్లున్నారు. నువ్వెళు

వనజా..." సహోద్యోగిని సాగనంపాలని చూసింది వసుంధర.

"వెళ్తాగానీ, మాకెందుకన్నీ అలా అబద్ధాలు చెబుతావ్?" నిలదీసింది వనజ.

"అబ్బా, అవన్నీ తర్వాత. అమ్మో... టీ లేటైతే చంపేస్తాడు..." అంటూ వంటింట్లోకి పరుగెత్తి, ఇందాక పెట్టిన టీని వేడిచేసి, కప్పులో పోసి, బాత్‌రూము దగ్గరే రెడీగా నిలబడింది.

శంకర్ బయటికొచ్చి, టీ కప్పు అందుకుని, కుర్చీలో కూచుంటూ, ఓ సిప్పు తాగి, "ఇవి ఇందాక మీ ఫ్రెండ్ కోసం పెట్టిన టీ కదూ. నాకొద్దు. ఫ్రెష్‌గా పెట్టి తీసుకురా..." వనజ అక్కడుందన్న సంగతి తెలీనట్లే వ్యవహరిస్తున్నాడు శంకర్.

వసుంధర గబగబా వంటింట్లోకి పరుగెత్తింది.

వనజ కనీసం చెప్పనైనా చెప్పకుండా బయటకు నడిచింది.

* * *

సికింద్రాబాద్ ప్లాట్‌ఫాం నుంచి వైజాగ్ వెళ్లే గరీబ్‌రథ్ బయలుదేరింది.

"ఇది కలా, నిజమా, వైష్ణవమాయా... నమ్మలేకపోతున్నాను మేడమ్. మీరు... మీరు... మాతోపాటు వైజాగ్ వస్తున్నారా..." రైలు బయలుదేరినా ఇంకా వసుంధరను ఆటలు పట్టిస్తూనే ఉన్నాడు కారుణ్య.

భాస్కర్ రెండుమూడు సందర్భాల్లో వసుంధరకు సాయం చేశాడు. ఆ కృతజ్ఞతతో, ఇంట్లో ఇబ్బందుల్ని లెక్క చేయకుండా, పెళ్లికి వెళ్లాలని నిర్ణయించుకుంది వసుంధర. శుక్రవారం రాత్రి బాస్‌తో సహా పదిమందీ రైలెక్కారు.

అందరికీ ఒకేచోట బెర్తులు రావడంతో సందడే సందడి. అంత్యాక్షరి ఆడారు. జోకులు చెప్పుకొన్నారు. కారుణ్య పాట పాడాడు. వసుంధరకు వేరే లోకంలో విహరిస్తున్నట్లు అనిపించింది.

ఎనిమిది దాటగానే "మేడమ్, ఇంకెందుకు ఆలస్యం, బాక్సులు బద్దలు కొట్టండి" అన్నాడు కారుణ్య. వసుంధర బ్యాగ్ తెరిచి, చపాతీలు, కుర్మా బయటకు తీసింది. వనజ స్వీట్లు తెచ్చింది. లలిత జంతికలు తెచ్చింది. అందరూ సుష్టుగా తిన్నారు.

వసుంధర అప్పటికి ఆరుసార్లు ఇంటికి ఫోన్‌చేసింది. భర్త ఇంట్లో లేడు. "తమ్ముడు ఏడింటికే పడుకున్నాడు" అని చెప్పాడు పెద్దబాబు. మరోసారి ఫోన్‌చేసింది. పెద్దబాబే ఎత్తాడు.

"నాన్న గారొచ్చారా?"

"లేదమ్మా"

"తమ్ముణ్ని నిద్రలేపు. టేబుల్ మీద అన్నం ఉంది. హాట్‌బాక్సులో ఎగ్‌ఫ్రై ఉంది. ఇద్దరూ తినండి" సూచనలందించింది వసుంధర.

పది నిమిషాలాగి పెద్ద బాబు ఫోన్‌చేశాడు.

"తమ్ముడు లేవటం లేదమ్మా. ఒళ్లు బాగా వేడిగా ఉంది. జ్వరం కాలిపోతోంది" బేలగా చెప్పాడు.

వసుంధరలో కంగారు మొదలైంది. సీట్లోనే కూలబడి, ఏడవటం మొదలు పెట్టింది.

"వసుంధర, కంగారు పడకు. మీ వారికి మళ్లీ ట్రై చెయ్" బాస్ చెప్పాడు.

అప్పటికి ఓ పాతికసార్లు భర్తకు చేసింది. ఫోన్ మోగుతోంది కానీ, జవాబు లేదు. మళ్లీ ప్రయత్నించింది. అదే పరిస్థితి.

కొడుక్కి మళ్లీ చేసి "ఎలా ఉంది తమ్ముడికి?" అడిగింది.

"కాలిపోతందమ్మా..."

వసుంధర కళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. "అందుకే, నేను ఎక్కడికీ రాను. రాకరాక వచ్చాను, ఇప్పుడే దాపురించాలా మాయదారి జొరం?"

"వసుంధరా, ఏడవకు. పది నిమిషాల్లో నీ సమస్య నేను పరిష్కరిస్తాను" అంటూ బాస్, వసుంధర వాళ్లింటికి దగ్గర్లోనే ఉండే డాక్టర్ రాజాకు ఫోన్‌చేశాడు.

"చెప్పండి నందకిషోర్‌గారూ, బాగున్నారా?" డాక్టర్.

"బాగున్నాను సార్. మీ నుంచి ఒక సాయం కావాలి" అంటూ విషయం చెప్పాడు.

"కంగారు పడకండి. ఓ జూనియర్ డాక్టర్ని వాళ్లింటికి పంపిస్తాను. దగ్గరుండి చూస్తాడు. అతను మీకు ఫోన్‌చేస్తాడు" అని ఫోన్ పెట్టేశాడు.

రెండు నిమిషాల్లోనే జూనియర్ డాక్టర్ ఫోన్‌చేశాడు. వసుంధర తమ ఇంటి అడ్రసు చెప్పింది.

పావుగంట తర్వాత అతని నుంచి ఫోన్. నందకిషోర్ మాట్లాడి, వసుంధరకు ఇచ్చాడు.

"అమ్మా, మీరేమీ కంగారు పడకండి. నార్మల్ ఫీవరే. పది నిమిషాల్లో తగ్గిపోతుంది" ధైర్యం చెప్పాడు డాక్టర్.



పావుగంట తర్వాత పెద్దబాబు ఫోన్‌చేసి, "అమ్మా, వేడి తగ్గింది. తమ్ముడు లేచి కూచున్నాడు. ఆకలవుతుందంటున్నాడు. బయటికెళ్లి బ్రెడ్ తెచ్చాను. తిన్నాక, పాలు వేడిచేసి ఇస్తా. నువ్వేం దిగులు పెట్టుకోకు" తల్లికి భరోసా ఇచ్చాడు.

మరో పావుగంట తర్వాత 'తమ్ముడు పాలుతాగి పడుకున్నాడు. నేను భోంచేశాను. పడుకోబోతున్నాను' అని చెప్పాడు.

"తలుపు గడియ పెట్టడం మర్చిపోవద్దు. నాన్న గారు కాలింగ్‌బెల్లు కొట్టినప్పుడు, కిటికీలోంచి బయటకు చూసి, తలుపులు తియ్యి" జాగ్రత్తలు చెప్పింది వసుంధర.

"థాంక్యూ వెరీమచ్ సర్" బాస్‌కు చెప్పింది వసుంధర.

"ఇంత చిన్నదానికే థాంక్స్ ఎందుకమ్మా. నువ్వు హాయిగా నిద్రపో. రేపు కూడా డాక్టర్ని ఇంటికి పంపిస్తాలే".

రెండు చేతులూ జోడించి, దండం పెట్టింది.

"ఛఛ... కొలీగ్స్ మధ్య ఇలాంటివి ఉండకూడదు" చేతులు విడదీస్తూ చెప్పాడు నందకిషోర్.

పడుకోబోతూ, రాత్రి పదకొండున్నరకు మరోసారి భర్తకు ఫోన్‌చేసింది.

"ఏమిటే నీ నస. నన్ను ప్రశాంతంగా పేకాట కూడా ఆడుకోనివ్వవా?"

పక్క బెర్తు మీదే పడుకున్న కారుణ్య తననే గమనిస్తున్నాడని గ్రహించి, ఫోన్ డిస్కనెక్ట్ చేసి, "సరేలెండి. నేను రేపు ఉదయం ఫోన్‌చేస్తా. బాబు జాగ్రత్త" అంది. కారుణ్యకు అర్థం కాలేదుగానీ, మిడిల్ బెర్తులో పడుకున్న వనజకు మాత్రం ఆ మాటల అంతరార్థం స్పష్టంగా బోధపడింది.

పొద్దున్నే లేస్తూనే మరోసారి ఇంటికి ఫోన్‌చేసి, చిన్నబాబుకు జ్వరం లేదని తెలుసుకుని, ఊపిరి పీల్చుకుంది వసుంధర.

పాలప్యాకెట్లు కార్చి పాలను వేడి చెయ్యడం, ఇల్లు ఊడవటం, హొటల్నుంచి టిఫిన్ తెచ్చుకోవడం, బియ్యం కడిగిపెట్టి అన్నం వండటం, పక్కింటి ఆంటీని కూర అడగటం... అన్నీ వసుంధర దర్శకత్వంలో పెద్దబాబు ఆధ్వర్యంలో అమలు కావటం సహోద్యోగులందరికీ స్పష్టంగా తెలుస్తూనే ఉంది.

* * *

శనివారం రాత్రి భాస్కర్ పెళ్లి ఘనంగా జరిగింది.

ఆదివారం సైట్‌సీయింగ్ ప్లాన్ చేసుకున్నారు. ముందుగా కైలాసగిరి వెళ్లారు. పదిమందితో కలిసి ఆడుతూ పాడుతూ మెట్లెక్కడం, ఒకరిపై ఒకరు సెటైర్లు విసురుకోవడం, అంతెత్తు శివపార్వతుల విగ్రహం ముందు ఫోటోలు దిగడం, కొండకొమ్ము నుంచి విశాఖ అందాలు వీక్షించడం, మధ్యమధ్యలో పల్లీలూ పాప్‌కార్న్‌లూ తినడం... వసుంధర సంకెళ్లు తెంచుకుని స్వేచ్ఛాప్రపంచంలో విహరించడాన్ని వనజ గమనిస్తూనే ఉంది.

తర్వాత వుడా పార్కుకు వెళ్లారు. కళ్లనిండా పచ్చదనం నింపుకున్నారు. వసుంధర అక్కడో కుందేలు పిల్లతో ఆడుకుంది. లాన్‌లో పరుగెత్తి తూనీగను పట్టుకుంది. రకరకాల పూలను చూస్తూ పులకించిపోయింది.

చిన్నపిల్లలా మారిపోయిన వసుంధరను వనజ విస్మయంగా చూస్తూ, తన పక్కనే ఉన్న కారుణ్యతో యథాలాపంగా "పాపం, జీవితంలో నరకం ఒక్కటే కాదు, స్వర్గం కూడా ఉందని వసుంధరకు తెలిసొచ్చినట్లుంది" అంది.

"ఏంటి మేడమ్ అలా అన్నారు?" అడిగాడు కారుణ్య.

"ఏం లేదులే, ఇవన్నీ నీకు అర్థం కావులే..." అంది వసుంధర వైపే చూస్తూ.

"వసు మేడమ్ వాళ్ల ఆయన్ని గురించేగా మీరు మాట్లాడేది..."

"కారుణ్యా..." నిజానికి వసుంధర ఇంటి పరిస్థితుల గురించి వనజ ఎవ్వరితోనూ చెప్పలేదు.

"నాకన్నీ అర్థమయ్యాయి మేడమ్. మొన్నటి చేతిమీద,

కంటిమీద గాయాలు మ్యాన్‌హ్యాండ్లింగేనని చిన్నపిల్లవాడిక్కూడా అర్థమవుతుంది".

ఆశ్చర్యంగా చూసింది వనజ. కారుణ్య మారు మాట్లాడకుండా, దూరంగా ఉన్న బాస్‌వైపు వెళ్లాడు.

మధ్యాహ్నం మంచి హోటల్లో భోంచేశారు.

సాయంత్రం అయిదు గంటలకు రామకృష్ణ బీచ్‌కు చేరుకున్నారు. నందకిషోర్ ఇసుకలో కూచున్నాడు. వసుంధర కూడా వచ్చి, పక్కనే కూచుంది. మిగతా అందరూ నీళ్లవైపు పరుగు తీశారు. ఉవ్వెత్తున ఎగసిపడి, నీటిముక్కలుగా ఒడ్డుకు చేరుతున్న అలల్ని సంభ్రమంగా చూస్తున్నారు. ముందుగా కారుణ్య ప్యాంటు మడిచి, మరికొంచెం ముందుకెళ్లి నీళ్లలో గంతులు వేయడం మొదలు పెట్టాడు. మిగతా ఉద్యోగులు జత కలిశారు. చిన్నపిల్లల్లా ఎగురుతున్నారు.

"కారుణ్యా, ఇదిగో ఈమెను కూడా లాక్కెళ్లండి" అంటూ వసుంధరను చూపించాడు.

కారుణ్య, వనజ వచ్చి, వసుంధరను లాక్కెళ్లారు.

ముందు కాస్త బెరుకుగా మసలిన వసుంధర, ఆ తర్వాత చిన్నపిల్లై పోయింది. కేకలు పెడుతూ, గంతులు వేసింది.

సూర్యుడు తల దాచుకోడానికి సముద్రం మాటుకు చేరుకుంటున్న దృశ్యం అద్భుతంగా ఆవిష్కృతమైంది.

కాసేపటికి, మబ్బులన్నీ నీలవర్ణంలో ఆకాశాన్ని ఎత్తిపట్టుకున్నాయి. సముద్రం మీదగా వీచే గాలికి ఒళ్లు జలదరిస్తోంది.

ఎవరికి వారు ఆ సంతోషచిత్రాలను తమ సెల్‌ఫోన్లలో బంధిస్తున్నారు.

ఏడున్నరకు అందరూ రోడ్డుమీదికి చేరుకున్నారు. సన్నగా వర్షం మొదలైంది.

"కారుణ్యా, ఈ వర్షంలో ఐస్‌క్రీము తింటే భలే ఉంటుంది.." మనసులోని కోరికను వెలిబుచ్చకుండా ఉండలేకపోయింది వసుంధర.

"ఆజ్ఞ మహారాణీ.." అంటూ కారుణ్య పరుగున వెళ్లి అందరికీ ఐస్‌క్రీములు తెచ్చాడు.

వర్షంలో తడుస్తూ ఐస్‌క్రీము తినడాన్ని ఆనందంగా ఆస్వాదించింది వసుంధర.

ఆ రాత్రికే తిరుగు ప్రయాణం. రైలు బయలుదేరగానే, వసుంధరకు మళ్లీ ఇల్లు గుర్తొచ్చింది. భర్త గుర్తొచ్చాడు. గాయాలు గుర్తొచ్చాయి. నరకం గుర్తొచ్చింది. మనసంతా దిగులు పరుచుకుంది.

* * *

నాలుగు రోజుల తర్వాత...

వసుంధర సెల్‌ఫోన్‌లో బీచ్ ఒడ్డున ఎంజాయ్ చేస్తున్న ఫొటోలు శంకర్ కంటబడ్డాయి.

ఆ రాత్రి...

పిల్లలు హాల్లో డిస్కవరీ ఛానల్ చూస్తున్నారు. శంకర్, వసుంధర బెడ్‌రూములో ఉన్నారు.

పులి జింకపిల్లను వేటాడుతున్న దృశ్యాన్ని టీవీలో క్లోజప్‌లో చూపిస్తున్నారు.

తన ఆక్రందన పిల్లలకు వినబడకూడదని, నరకాన్ని పంటిబిగువున భరిస్తోంది వసుంధర.

* * *

రెండు నెలల తర్వాత...

చెన్నైలో వనజ చిన్నతమ్ముడి పెళ్లికి వెళ్లడానికి ప్లాన్ చేస్తున్నారు ఆఫీసులో. తొమ్మిదిమందీ వెళ్లడానికి సిద్ధమయ్యారు. ఎవ్వరూ వసుంధరను అడగలేదు.

"అదేంటి, నన్ను తీసుకెళ్లరా?" వనజను అడిగింది వసుంధర.

"అంటే... నీకు... కొంచెం ఇబ్బందేమోనని..." నసిగింది వనజ.

"నో ప్రాబ్లమ్. నేను కచ్చితంగా వస్తాను. నాకూ టిక్కెట్ బుక్ చేయండి" కచ్చితంగా చెప్పేసి, తన సీట్లో కూచుంది వసుంధర.

కారుణ్య మెల్లగా వసుంధర సీటు దగ్గరకు వచ్చాడు.

"ఎట్టెట్టా, మీరు మరోసారి సాహసం చేస్తారా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును" స్థిరంగా అంది వసుంధర.

"ఇంకోసారి ఆలోచించుకోవే" పక్క సీట్లో కూచున్న వనజ అడిగింది.

"చూడండి, ముల్లును ముట్టుకోకుండా, గులాబీ పరిమళాన్ని ఆస్వాదించలేం" సరికొత్త స్వరంతో చెప్పింది వసుంధర.



కవిత

# దేశం వెలిగిపోతుంది

◆ మేరెడ్డి యాదగిరిరెడ్డి
9949415796

ప్రపంచీకరణ పట్టణీకరణ
అమ్మతనం పల్లెతనం డొల్లబోయింది
మంచితనం మనిషితనం మటుమాయం
కులవృత్తుల మింగిన ప్రపంచీకరణ భూతం
డాలర్ వుచ్చులో దేశపు యువత
ఇంటర్నెట్‌లో మేధస్సుబందీ
పసితనం కేర్ సెంటర్లలో కేరింతలు
బాల్యం కాన్వెంట్ల ఎక్వేరియంలో చేపపిల్ల
అయినా దేశం వెలిగిపోతుంది
బడ్జెట్ ఓమాయ
కార్పోరేట్లకు వడ్డించిన విస్తరి
సగటు జీవికి నడ్డి విరిచేపన్నుల వడ్డన
పంటభూముల్లో 'సెజ్' వ్యవసాయం
బక్క రైతుకు కార్పోరేట్ వురి
అప్పుల వురి కొయ్యలకు రైతన్నలు
నేతన్నల ఆకలి చావులు
అయినా దేశం వెలిగిపోతుంది
ఆకలి, దారిద్ర్యం, విలయతాండవం
మర్డర్లు, మానభంగాలు మాఫియాలతో
దేశం వెలిగిపోతుంది



మతం మత్తుమందు నూరి పోస్తున్న పీఠాధిపతులు
మెదళ్లలో విషాన్ని నింపి
జాతిని నిర్వీర్యం చేస్తున్న బుల్లిపెట్టెలు
అయినా దేశం వెలిగిపోతుంది
దూసుకపోతున్న సెన్సెక్స్
బులియన్ మార్కెట్ పరుగులు
ప్రపంచ కోటీశ్వరుల అగ్రభాగాన భారతీయులు
లక్షల కోట్ల బొగ్గు టెలికాంస్కాములు
కంపెనీలకు వేలకోట్ల సబ్సిడీలు
కోట్లలో కంపెనీల లాభాలు
వేలకోట్ల అప్పుల్లో దేశం
లక్షల కోట్ల నల్లధనం స్విస్ బ్యాంకుల్లో
బహుళ జాతి కబంధ హస్తాల్లో దేశం
ఒబామా సరసన టాటా, బిర్లా, అంబానీలు,
స్వర్ణభారత్‌లు, స్వచ్ఛభారత్‌లు,
కోట్లు పలికిన మోడీ 'బుష్' కోటు
అందుకే దేశం వెలిగిపోతుంది



# మొలకెత్తే విత్తనంలా

◆ అజయ్
9491333002



నువ్వు బానిసవి కాదు
నువు బానిసవి కాదంటే కానేకాదు

కులానికి బానిసవి కాకు మతచట్రంలో చిక్కుకోకు
ఉపయోగించుకో నీలో రగులుతున్న ఆ అగ్నికణాన్ని
ఉపయోగించుకో.... సద్వినియోగించుకో...
లేదంటే అది నిన్ను నిలువునా కాల్చివేస్తుంది
కులరూపంలో గాని మతం రూపంలో గాని

మెదడులో కట్టుకున్న
ఆ కుల అడ్డుగోడలను కూల్చేయ్...
నీలో వున్న ఆ అగ్నికణంతో...
ఆ మత మహమ్మారిని
మట్టి కరిపించేయ్....
మనిషిని మనిషిగా చూడు
మతంతో కాదు – కులంతో కాదు

మట్టిలో అడ్డుపొరలను
తొలగించుకు మొలకత్తే విత్తనంలా రా... పైకి రా...
నీ చుట్టూ కట్టుకున్న కుల, మత రక్కసి పొరలను
తొలగించుకు రా... పైకి రా... పైపైకి రా...

మమతలను చిగురించు మానవత్వాన్ని పరిమళించు
మహా వృక్షంలా ఎదిగి సమానత్వాన్ని పంచు...



## నేను మలాలా




**- మలాలా యూసెఫ్‌జెయ్**

**వెల : 200/- పేజీలు: 319**

**ప్రతులకు : ఐద్వా రాష్ట్ర కార్యాలయం**

మలాలా మనలను స్వాత్ వాలికి తీసుకునిపోయింది. అక్కడి పిల్ల తెమ్మెరలు మనలను పులకింపజేస్తాయి. నునువెచ్చటి సూర్యకిరణాలు మనలను పరివశింప చేస్తాయి. అందమైన ఆ ప్రకృతితో పాటు వికృతమయిన తాలిబాన్ల ఘాతుకాలనూ మనకు కళ్ళకు కట్టేంత సునిశితంగా చిత్రించింది. మత మౌఢ్యానికి మానవత్వానికి ఎంత దూరమో మనం ఈ ఆత్మకథలో చూస్తాం.

**- కె. ఉషారాణి**

## చైతన్య స్వరాలు కవితా సంకలనం

**- సాహితీస్రవంతి-విశాఖ బుక్ ఫెస్టివల్**




**వెల : 100- పేజీలు: 214**

**ప్రతులకు : 98487 10507**

విశాఖలో గురజాడ సాహిత్య వేదిక నుండి ప్రముఖ సాహిత్య వేత్తలు వివిధ సాహిత్యాంశాలపై ప్రసంగించారు. ప్రతిరోజు ప్రసంగాల అనంతరం ఉత్తరాంధ్ర జిల్లాలనుండి వచ్చిన కవులు 'చైతన్య స్వరాలు' పేరిట తమ స్వీయ కవితలను వినిపించారు. విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోని కవులు, రచయితలు, సాహిత్యాభిమానులు ఈ గురజాడ సాహిత్య వేదిక కార్యక్రమాలో భాగస్వాములయ్యారు. ఆ వేదికపై చదివిన కవితలతో పాటు సేకరించిన మరికొన్ని కవితలను కలిపి వెలువరిస్తున్న కవితల సమాహారం ఈ చైతన్య స్వరాలు' కవితా సంకలనం.

**- ప్రచురణ కర్తలు**

## చాసో స్ఫూర్తి




**- డా॥ రామసూరి**

**వెల : 150 - పేజీలు: 208**

**ప్రతులకు : 9440143488**

చాసో పేరుమీదుగా చాగంటి తులసిగారు వ్యవస్థాపకులుగా కొంతమంది మిత్రులం 'చాసోస్ఫూర్తి' సాహిత్య సంస్థ ఏర్పాటు చేయడం జరిగింది. ఎందరో ప్రసిద్ధులు ఆ సభలలో పాల్గొని, చాసో సాహిత్యాన్ని ప్రతిభావంతంగా సమీక్షించారు. ఆ ప్రసంగాల సంకలనం గ్రంథ రూపంలో తేవాలన్న మా ఆకాంక్ష యీనాటికి నెరవేరుతోంది.

**- రామసూరి**

## తొలి అడుగు




**- అక్కినేని కుటుంబరావు**

**వెల : 100/- పేజీలు: 239**

**ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు**

మన బాల్యాన్ని తట్టి లేపుతుంది ఈ నవల! మన పిల్లల బాల్యాన్ని ఎలా తీర్చిదిద్దుకోవాలో కూడా నేర్పుతుంది ఈ నవల. ఏమీ సంబంధం లేకపోయినా గోర్కీ 'నా బాల్యం', నా బాల్యసేవ గ్రంథాలను గుర్తుకు తెస్తుంది. ఈ నవల! ఈ నవల చదవటం పాఠకులకు ఒక మధురమైన అనుభవం! "పోయిన బాల్యపు చెరిగిన పదములచిహ్నం కోసం" మీరూ ఈ నవల చదవండి.

**-సింగమనేని నారాయణ**

## పొద్దున్నే కవిగొంతు




**- శిఖామణి కవిత్వం**

**వెల : 120 - పేజీలు: 108**

**ప్రతులకు : 9848202526**

జీవితపు ఆకురాయి మీద సానబట్టిన కవి శిఖామణి. అతని పదబంధాలు, వ్యక్తీకరణలు, అలంకార సామాగ్రి అరుదైనవి. అందరికీ సాధ్యపడేవి కావు. గొప్ప జీవితానుభవం, ఒక మహత్తరమైన సామాజిక అంకితభావం ఆవహించి ఉంటే కానీ రాసిన ప్రతి కవితా ప్రాణంతో ఇలా తొణికిసలాడడం వీలుపడదు.

**- దేవి ప్రియ**

## సకల




**సాహిత్య వ్యాసాలు**

**- డా॥సి. మృణాళిని**

**వెల : 100/- పేజీలు: 221**

ప్రతులకు : ........................

పాఠకులకు రచయిత పట్ల, రచన పట్ల అవగాహన కలిగించడం, ఇంకా విస్తృతార్థంలో సాహిత్యం పట్ల అభిరుచిని పెంచడం ముఖ్యమని నాకనిపిస్తుంది. ఆ దృష్టితో కొందరు కవులు/రచయితలను చూడడానికి, చూపడానికి చేసిన ప్రయత్నం ఈ వ్యాససంకలనంలో ఉంది

**-మృణాళిని**

## వేకువ పిట్ట




**- ఎస్.ఆర్. భల్లం**

**వెల : 100/- పేజీలు: 82**

**ప్రతులకు : 9885442642**

ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాద వికృతరూపాలు, కళ్లముందు విస్తరించే వస్తు విశ్వం, ధన దాహం, పదవీ వ్యామోహం, యాంత్రిక జీవన వేగం, మనిషి ఏకాకితనం, యువత విచ్చలవిడి వికారం ఇత్యాది నేపథ్యాలకి భిన్నంగా మానవీయతను కాపాడుకునే కవితా ప్రయత్నమే ఈ 'వేకువపిట్ట'.

**- ఎస్.ఆర్. భల్లం**

## స్మరణిక




**- శిఖామణి**

**వెల : 95/- పేజీలు: 111**

**ప్రతులకు : 9848202526**

ఒకోసారి ఒళ్లంతా తడిమి నుదురుమీద ముద్దెట్టుకునే అమ్మలాగా.. మరోసారి మన మనస్సు నింపీ కుడిచేతికి రాఖీ కట్టున్న చెల్లాయి లాగా... మరోసారి వెనకనుంచి కళ్లు మూసి గాఢ పరిష్వంగం చేసుకునే ప్రియురాల్లాగా... మరోసారి గాయపడ్డ యోధుడి గాయాన్ని కన్నీళ్లతో కడిగే ఆత్మీయురాలిగా... శిఖామణి కవిత్వం ఏదో ఒక అనుభూతి కలిగించి తీరుతుంది. ముఖ్యంగా ఇది... మహాకవుల స్మరణిక.

**- దాట్ల దేవదానం రాజు**

## అన్వేషణ




**- కరణం శేషపిళ్ళై**

**వెల : 80/- పేజీలు: 70**

**ప్రతులకు : 9703555652**

ఈ కథలను చదువుతూ వుంటే మనకు తెల్సిన పరిసరాలలో నడయాడినట్లూ, మనకు తెలిసిన వ్యక్తులనే కలుసుకున్నట్లూ అనిపిస్తుంది. మనుషుల్లో ఇంకా భావుకత, అమాయకత్వము, మంచితనము మిగిలే వున్నట్లు తెలుస్తుంది. నిజాలను కలగనడంతో పాటు కలలను నిజాలుగా చేసుకోవాలన్న రచయిత తపన స్పష్టంగా కనపడుతుంది.

**- మధురాంతకం నరేంద్ర**

## తెలుగు మరాఠీ దళిత కవిత్వం






**- డా॥ శిఖామణి**

**వెల : 150/- పేజీలు: 187**

**ప్రతులకు : 9848202525**

ఈ తులనంలో పరిశోధకుడు వస్తు పరిశీలన, వస్తుగత పరిశీలన అపూర్వంగా చేశాడు. అమ్మా, నాన్న, కులం పేరిట అమానవీకరణ, అత్యాచారాలు, మార్క్సిస్టుల మీద కవులు ఎక్కు పెట్టిన తీవ్ర విమర్శ వీటి గురించి తెలిపాడు. పురాణ ప్రతీకలను పరిశీలించాడు. దళిత సాహిత్య కళాసౌందర్య శాస్త్రం గురించి విశ్లేషించాడు. ఈ పరిశోధణ మరికొన్ని తులనాత్మక అధ్యయనాలకు ప్రేరణ ఇవ్వడమే కాకుండా మార్గనిర్దేశనం చేస్తుంది. ఆయా వాదాలు, ధోరణులు, ఉద్యమాలు, భారతీయ భాషా సాహిత్యాల్లో ఏ విధంగా ప్రవర్తిల్లాయో చూపడానికి ఇటువంటి అధ్యయనాల అవసరం ఉందని గుర్తించడానికి ఈ సిద్ధాంత గ్రంథం ఉపకరిస్తుంది.

**-డా॥ ఆర్. సీతారాం**

## ప్రసిద్ధ తెలుగు నాటక పద్యాలు






**- డా॥ వి.ఆర్. రాసాని**

**వెల : 80/- పేజీలు: 148**

**ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్**

ఒకనాడు తెలుగునాట ఇంటింటా, రచ్చలో, గొడ్లు కాసే పిల్లగాడి నోటిలో ఆ పద్యాలు మార్మోగాయి. చక్కని వ్యవహారశైలి, తెలుగుదనం ఉట్టిపడేలా ఆ పద్యాలుండటం ఒక కారణం. ఇంతగా ప్రజాదరణ పొందిన అమూల్యమైన పద్యాలు తరతరాలు మననం చేసుకొనేందుకు ఉపయుక్తంగా వుండేందుకు దోహదపడే విలువలై పుస్తకం. తెలుగువారి ప్రతి ఇంటా ఉండదగిన అలనాటి తమనీయ నాటక పద్యాల సమాహారమిది. తక్షణం మీ సొంతం చేసుకోండి.

## చాసో కథలు సాంస్కృతిక పదకోశం






**- చాగంటి తులసి**

**వెల : 80 - పేజీలు: 102**

**ప్రతులకు : 9963377672**

భూషా సంస్కృతులు మొత్తం ఆంధ్రదేశం అంతటివీ అయినప్పటికీ ప్రాంత ప్రాంతానికి పలుకుబడిలో తేడా ఉంటుంది. విజయనగరం ప్రాంతపు భాషా సౌందర్యం తెలుగుజాతి అంతటికీ చెందిన తెలుగు సంపద. ఇక్కడి పలుకుబడి సొగసుని మిగిలిన ప్రాంతాలకి తెలియచేసి సాంస్కృతిక సమైక్య చైతన్యాన్ని ఆహ్వానించే ఉద్దేశ్యంతో ఈ సాంస్కృతిక పదకోశం రూపొందించడం జరిగింది.

**- చాగంటి తులసి**

# కవిత

## మట్టి గుండె జారిపోతోంది

◆ గవిడి శ్రీనివాస్
08886174458



మమకారం పంచిన తల్లిలా
నా మట్టి లాలించి పాలించేది
నేను తెల్లారే రేగిన ఆనందంతో
పొలాల గట్లవెంట తుళ్ళిపడేవాడిని
కళ్ళల్లో పరిమళాల పందిళ్ళు విరిసేవి
అంతే
హొయ్యారంగా ఊగే ఆకుపచ్చని పొలాన్ని
రెక్కలు చాచుకు హత్తుకునే వాణ్ణి
దొర్లుతున్న సంవత్సరంలో
పైరుపచ్చని కలలు దృశ్యాలై నిలిచేవి
రాజధాని రెక్కల్లో
రాక్షస కత్తులు దూస్తున్నాయి
చీకటి స్వప్నాలు
ఊహించని దారులు
బతుకుని ఛిద్రం చేస్తున్నాయి
ఆకుపచ్చని గుండె మీద
సిమ్మెంట్ దరువులు మోగుతున్నాయి

ఈ కళ్ళముందే
మబ్బుపడుతున్న పొలాన్ని చూస్తే
ఆకాశాన్ని పిండి
కన్నీటి ధారలు చిందిస్తున్నట్లు
నాలో ఒక నిర్వేదం అలుముకుంది
ఇక్కడ మట్టి బంధాల్ని లెక్కించే
మనుషుల్ని చూడలేం
ఊహల సౌధాల్ని
ఆలింగనం చేసుకుని
వ్యాపార సామ్రాజ్య వాదాన్ని
బాకా ఊదుతున్న
రాబంధుల్ని భరిస్తున్నాం
నిశ్శబ్దం ముక్కలైన చోట
విప్లవాలు మొలకెత్తుతాయి

ఆశల దృశ్యాల్ని చూపిస్తూ
రిక్త హస్తాలు ఎదురైన వేళ
రగులుతున్న రక్తం
చెరిగిపోని పుటగా
లిఖించబడుతుంది

---

## నానీలు

◆ వెల్దండి శ్రీధర్
98669 77741

నా రక్తం నిండా
ఊరే
నగరం
పై తొడుగు మాత్రమే

గుండెసంచిలో
అనుభూతుల మణులు
కాగితం మీద
మరిన్ని ఘృణులు

విధ్వంసాన్ని
అభివృద్ధి అంటున్నాడు
పల్లెలు
నలుగుతున్న మల్లెలు



నది
ప్రవహిస్తుంది చూడండి!
హరిత విప్లవం
వైపేనంటావా?

పుష్పకవిమానమంటే
హృదయమే
ఎంతమందికైనా
అది నిలయమే

# కాకినాడ సాహితీస్రవంతి వార్షికోత్సవం




ఆగస్టు 9న కాకినాడ రోటరీక్లబ్ ఆడిటోరియంలో సాహితీస్రవంతి ద్వితీయ వార్షికోత్సవ మహాసభ జరిగింది. ప్రారంభ సభకు ప్రముఖ కవి - విమర్శకులు సాహితీస్రవంతి అధ్యక్షులు డా॥ అద్దేపల్లి రామోహన రావు అధ్యక్షత వహించారు. గడల శివప్రసాద్ గారు ముఖ్య అతిథులను, వక్తలను వేదికపైకి ఆహ్వానించారు. సాహితీ స్రవంతి ప్రారంభసభ గరికపాటి మాష్టారు వ్రాసిన జయగీతికను రాములుగారు గానం చేయడంతో ప్రారంభమయింది.

ఈ సభలో ముఖ్య అతిథిగా ఉపాధ్యాయ ఎమ్.ఎల్.సి. రాముసూర్యారావు మాట్లాడుతూ విజ్ఞానవేత్తలు కొలువు తీరిన ఈ సభలో పాల్గొనడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఎందుకంటే నేటి సమాజానికి సజ్జన - సాంగత్యం - సత్ సంకల్పం రెండూ ముఖ్యంగా కావాల్సి ఉంది. అది ఈ రోజు నాకు ఇక్కడ లభించింది అన్నారు.

డా॥ అద్దేపల్లి వారు అధ్యక్షోపన్యాసం చేస్తూ ఈ సాహితీ స్రవంతికి కార్యదర్శులు, కోశాధికారులు అంటూ ఎవ్వరూ లేరు. ఇది అందరిదీ, అందరూ కలిసే నెల నెలా ఎంతో ఉత్సాహంగా ఈ కార్యక్రమాల్ని నిర్వహించుకొంటున్నారు. అందుకే ఇది ఏ పొరపొచ్చాలకు తావు లేకుండా నిరాఘాటంగా సాగిపోతుంది అని అన్నారు.

సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి గారు అతిథిగా మాట్లాడుతూ మంచి సాహిత్యం ఎప్పుడూ సంస్కరణే ప్రధాన లక్ష్యంగా సాగుతుంది. ఒక కవి లేదా రచయిత సమాజం తనని గుర్తిస్తోందా? లేదా? అని భావించకుండా ముందు అతడు సమాజాన్ని గుర్తించాల్సి ఉందన్నారు. సాహిత్యాన్ని జనరంజకం చేసి ప్రజల వద్దకు తీసుకువెళ్ళగలగాలి. ఆ కవిత్వం ఉత్తేజపూరితంగా, ఉల్లాసంగా ఉండటం అవసరం అన్నారు.

సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ వొరప్రసాద్‌గారు మాట్లాడుతూ సమాజం - సాహిత్యం పరస్పరం ప్రభావితం అవుతాయన్నారు.

కాకినాడ సాహితీస్రవంతి కన్వీనర్ గనారా మాట్లాడుతూ కాకినాడలో ప్రజల్ని సమాజాన్ని ప్రభావితం చేసే యువకవుల్ని ముందుకు తీసుకువచ్చే ఆలోచనతో ఈ సాహితీస్రవంతిని రెండు సంవత్సరాలక్రితం స్థాపించామన్నారు. ఈ స్ఫూర్తితో సాహితీ స్రవంతి సభ్యులు కవిత్వం, నవల, కథల వంటి అంశాల్లో వివిధ బహుమతుల్ని సాధించడం ఎంతో సంతోషించదగిన విషయం అన్నారు.

మధ్యాహ్నం జరిగిన సదస్సుకి సమకాలీన కథ సదస్సుకి వొరప్రసాద్ అధ్యక్షులుగా వ్యవహరించారు. మల్లిపురం జగదీష్ మాట్లాడుతూ ఒక ఆదివాసీగా, ఆదివాసీలపై కథలు వ్రాసిన కథకునిగా తన చుట్టూ ఉన్న ప్రపంచాన్నే తాను కథగా మలిచానని, అయితే నా ఒక్క గొంతు సరిపోదు. ఇంకా కథకులు కావాలి. ఇప్పటి వరకు అన్ని వాదాల్లోను చెప్పిన దాని కంటే చెప్పాల్సిందే ఎక్కువ ఉందంటూ ముగించారు. అద్దేపల్లి ప్రభు మాట్లాడుతూ

సమకాలీన కథలోని లోటుపాట్లతోపాటు కథా సాహిత్యంపై వచ్చిన విమర్శను కూడా పట్టించుకోవాల్సి ఉందన్నారు. ఏ కథకైనా వస్తువు - శిల్పం రెండూ ముఖ్యమే అన్నారు.

సత్యాజీ మాట్లాడుతూ ఉత్తరాంధ్ర ప్రాంతం నుండి కథ రావాల్సిఉందన్నారు.

దంటు సూర్యారావు గారు ప్రాచీన హోదా దక్కిన తెలుగు భాషను ఎలా సంరక్షించుకోవాలన్న విషయాన్ని కవులు - రచయితలు ఆలోచించాల్సి ఉందన్నారు.

సమకాలీన కవిత్వం - నవల సదస్సులో సభాధ్యక్షులుగా ప్రముఖ సాహిత్యవేత్త డా. ద్వా. నా. శాస్త్రి మాట్లాడుతూ కవిత్వం వల్ల సానుభూతి, దయ, ఆవేశం, ఆలోచన, పిడికిలి బిగించడం, ప్రశ్నించడం వంటివి అలవడతాయన్నారు. అన్ని వాదాలు కవిత్వంలో వచ్చి వెళ్ళిపోయాయి. ఇప్పుడు రావాల్సింది "రాజకీయవాద - కవిత్వం'' ఎందుకంటే సంస్కరించలేనంతగా భ్రష్టు పట్టిపోయింది. దాన్ని సంస్కరించే ప్రయత్నం కవులు చేయాలన్నారు.

కాకినాడ రోటరీ క్లబ్‌లో ఆగస్టు 9న జరిగిన కాకినాడ సాహితీస్రవంతి ద్వితీయ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న ప్రధాన కార్యదర్శి గనారా. చిత్రంలో శాసన మండలి సభ్యులు సూర్యారావు మాష్టారు, ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహనరావు

ముఖ్యవక్త రామసూరి మాట్లాడుతూ ఇప్పుడు కవుల్లో స్త్రీవాదులు, దళిత వాదులు, మైనారిటీ వాదులు, బి.సి.వాదులు ఉన్నట్లుగా పాఠకుల్లో లేరు. పాఠకుల్ని ఏకీకృతం చేసే సాహిత్య వాతావరణం రావాలన్నారు.

ఇక వాడ్రేవు వీరలక్ష్మీ దేవి సమకాలీన నవలపై మాట్లాడుతూ కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం పొందిన నవలలన్నీ గొప్పవి కావు. అలాంటి పురస్కారాలు పొందినంత మాత్రాన ఆ నవలలు గొప్పవి కాకపోవు అని చెబుతూ కాలుతున్న పూలతోట, వెండిమేఘం, ఒరియాలో యాజ్ఞసేని వంటి నవలల్ని గూర్చి చక్కని సమీక్ష చేసారు.

ఈ సమావేశంలో అద్దేపల్లి ఫౌండేషన్ వారి ఉత్తమ కవితా సంపుటి పురస్కార ప్రధానం జరిగింది. అధ్యక్షులుగా డా.జి. సీతారామస్వామి వ్యవహరించారు. కవి సమాజానికి అవసరం. కవిని ప్రోత్సహించాలి ఆదుకోవాలన్నారు. అందుకే ఈ పురస్కారాల్ని ప్రధానం చేయడం జరుగుతోందన్నారు.

అద్దేపల్లి ఫౌండేషన్ ఉత్తమ కవితాసంపుటి పురస్కార గ్రహీతగా ప్రథమ బహుమతిని ప్రకాశం జిల్లా వాస్తవ్యులు కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి అందుకొన్నారు.

వీరి "ఎప్పటికీ కొత్తగానే" అనే కవితా సంపుటికి ప్రథమ బహుమతి లభించింది.

ద్వితీయ బహుమతిగా గోదావరి ఖని వాస్తవ్యులు ఏలేశ్వరం వెంకటేష్ "నమ్మకాలు వమ్మవుతున్న చోట" అనే కవితా సంపుటికి అందుకోవటం జరిగింది.

ఇక నెల్లూరు వాస్తవ్యులు చిన్న నారాయణ రావు "గుండె దీపం" అనే కవితా సంపుటిని తృతీయ బహుమతికి ఎంపిక చేయడం జరిగింది.

ఈ మూడు కవితా సంపుటలపై ప్రముఖ యువకవి అవధానులు మణిబాబు చక్కని విశ్లేషణ చేసారు.

సాహితీ స్రవంతి ప్రతి నెలా సాహిత్యహేల ఆధ్వర్యంలో సంవత్సరం పొడువునా జరిగిన కవి సమ్మేళనాలలో చదివిన మంచి కవితలన్నింటిని "ఆశా దీపం" అనే శీర్షికతో కవితా సంపుటిగా వెలువరించటం, దాన్ని ఆవిష్కరించడం జరిగింది. దీన్ని డా॥ అద్దేపల్లి ఆవిష్కరించారు. దీనిపై సమీక్ష చేసారు.

ఆ తరువాత డా॥ శిరీష వ్రాసిన మహిత గోదావరి అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు.

ఆపై మద్దా సత్యనారాయణ గారి "జ్ఞాన చంద్రిక" అనే బాల సాహిత్య పద్య కావ్య ఆవిష్కరణ జరిగింది.

సాయంత్రం 5 గం॥కు కవి సమ్మేళనం జరిగింది. వీటికి డా॥ జ్యోష్యుల కృష్ణబాబు, మాకనీడి సూర్య భాస్కర్, శ్రీమతి అద్దేపల్లి జ్యోతి గార్లు అధ్యక్షత వహించారు. మూడు ఆవృత్తులుగా జరిగిన ఈ కవి సమ్మేళనంలో డా॥ వుయ్యపు హనుమంతరావు, వర్మ, కలిదిండి, కత్తిమండ ప్రతాప్, రాపాక దొరబాబు, ఏలేశ్వరం వెంకటేష్, సుస్మిత, గరికపాటి మాష్టారు, వి. యన్. ఆర్. ఎన్. సోమయాజులు, ఇంద్రకంటి నరసింహామూర్తి, కె. శివ, పద్మజా వాణి గారు, జామి వీరేష్, కొల్లూరి మురళి కుమారి మంచి కవితల్ని చదివి వినిపించారు.

♦ గనారా

# ఉత్తేజంగా, ఉత్సాహంగా విశాఖ కవిత్వ కార్యశాల




కళ్ళెదుట కనిపించే దృశ్యాలను గుర్తు చేసుకుంటూ హృదయంలో దాగివుండే భావాలను వ్యక్తీకరించాలను కోవడమే కవిత్వమని ప్రముఖ సాహిత్యవేత్త చందు సుబ్బారావు అన్నారు. ఆగష్టు '2' ఆదివారం నాడు ఉదయం 10 గంటలకు విశాఖనగరంలోని పబ్లిక్ లైబ్రరీలో సాహితీస్రవంతి నిర్వాహణలో "కవిత్వ కార్యశాలను" ఆయన ప్రారంభించారు. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో చందు సుబ్బారావు మాట్లాడుతూ చిన్నపిల్లల్లో ఈ సృజనాత్మకత అధికంగా వుండడం తాను గమనించానని అన్నారు. ఏ భావాలనైతే వ్యక్తీకరించాలని భావిస్తారో అదే పోయెట్రీగా ఆయన అభివర్ణించారు.

కవిత్వం ఒక సృజన కదా... ఆ విద్యను చేయిపట్టి ఎవరైనా నేర్పిస్తారా? కవిత్వం హృదయంలోంచి పరిమళించే భావావేశం కదా? దాన్ని ఎవరైనా అక్షరక్షరం దిద్దిస్తారా? భావాలు పొదగడానికి, అక్షరాలు కవితాస్త్రాలుగా మారడానికి శిక్షణ ఉంటుందా? అసలు ఇది సాధ్యమౌతుందా? అని ఈ కవిత కార్యశాల తలపెట్టినప్పుడు కొంతమంది కవులకైనా ఈ ప్రశ్నలు ఉదయించి వుంటాయి, సందేహాలు తలెత్తివుంటాయి. కాని కార్యశాల మొదలైన తరువాత కొద్దిసేపట్లోనే ఆ తటపటాయింపులన్నీ పటాపంచలైపోయాయి.

ప్రముఖ కవి సీతారాం కవిత్వ కార్యశాలను నిర్వహించారు. హాజరైన కవులను ఏడు బృందాలుగా విభజించి, అద్భుతంగా కవితావరణంలోకి తీసుకెళ్ళిపోయారు. కవిత్వం రాయడం ఎంత సులభాతి సులభమో వివరిస్తూ... కవులను కవితా జగత్తులోకి ప్రవేశపెట్టారు. చిన్నతనంలో పిల్లలు ఉపయోగించే పదాలను వారి ఆటలు, మాటల్లో కవితా దృష్టి ఎలా వుంటుందో వివరించి చెప్పడం అందరినీ ఆకట్టుకుంది.

అమ్మకళ్ళు అంటే ఏమిటని ఓ చిన్నారిని తాను ఒక సందర్భం ప్రశ్నించగా "అమ్మ కళ్ళు వెన్నెల పందిళ్ళు." అని ఆ పాప రాసిందని, అలాగే మా అమ్మ కళ్ళు సూర్యచంద్రులు అని చెప్పడం తనకెంతో ఆశ్చర్యాన్ని కలిగించిందని ఒక కన్ను, సూర్యుడు, (కోపమొస్తే) మరో కన్ను చంద్రుడు (సంతోషంతో) అని.. ఆ పాప రాసిందన్నారు. అమ్మ కళ్ళు ఎప్పటికీ కలత గూళ్ళు" గా బ్రతికే వుంటాయని వెల్లడించారు.

కవులను ఏడు బృందాలుగా చేసి వారితో రకరకాలుగా కవితాభ్యాసం చేయించారు. మొదటిగా ఒక్కో బృందానికి ఒక్కో కవిత చొప్పున పంచారు. అందరిని చదవమని, చర్చించమని చెప్పారు. ఇచ్చిన కవితను బయటికి అందరికి అర్థమయ్యేలాగ చదవమన్నారు. మనిషికే కాదు, కవితకూ గొంతు వుంటుందని చెప్పారు. సీతారాం ప్రతీ మాటకూ భావ భంగిమ ఉంటుంది. ఎలా చదవాలో, ఎలా చదివితే ఏ భావం స్ఫురిస్తుందో - వివరించారు.

ఆ తరువాత ఒక్కో బృందానికి ఒక్కో పెయింటింగ్ చార్టు ఇచ్చారు. ఒక బృందానికి తెల్లకాగితం ఇచ్చారు. పెయింటింగ్‌లో ఏముందో అర్థం చేసుకోవాలి, చర్చించాలి. తరువాత కవిత్వం మొదలుపెట్టాలి. బృందంలోని ఒక్కొక్కరు ఒక్కొక్క వాక్యం... వాక్యాలన్నీ గుదిగుచ్చి ఒక కవితగా మలచాలి.

అరగంటలో అద్భుతం జరిగిపోయింది. కవిత్వం సిద్ధమైపోయింది. మళ్ళీ ఆ కవిత్వం అందరూ చదివి వినిపించారు. ఆ పదాల ప్రయోగాలు లోతుపాతులు, తాత్విక చింతనలు విడమర్చి చెప్పారు.

120 మంది కవులు కవయిత్రులు ఈ కార్యశాలకు

## విశాలత్వంలోకి...

- జుగాష్ విలి
98482 66384



ప్రియతమా
పదపోదాం తాజాగా
తపన తపోవనంలోకి
లేలేత పువ్వులతో
మరింత తాజా అయిన
ముచ్చట్లు చెప్పుకుందాం

పదపోదాం పరిశుభ్రంగా
మంచుతెరలను తప్పుకుంటూ

తడి తన్మయత్వపు
వేకువ ఉదయపు తావిలోకి
సుమధుర పరిమళంలోని
పసివాసన
పసిపిల్లల్లా
చిరునవ్వులతో తడుములాడుకుందాం

పోదాం పద
విశ్వ విశాలత్వంలోకి
ప్రియతమా
పోదాంపద



హాజరయ్యారు అందులో ఎనిమిదేళ్ళ ప్రీతి నుండి 70 ఏళ్ళ పెద్దల వరకూ ఈ కార్యశాలలో పాల్గొనడం విశేషం. అందులో కొత్తగా రాస్తున్నవారు మొదలుకొని బాగా పేరు మోసిన కవులు కూడా వున్నారు. అందరూ ఉత్సాహంగా ఉత్తేజపూరితంగా, ఒకింత ఉత్కంఠభరితంగా మమేకమైపోయారు. కవితా సాధన చేశారు. కవితాలోచన చేశారు. కవితాలోకంలో విహరించారు. మొత్తానికి కవిత్వ కార్యశాల కొత్త, పాత కవులందరికి ఒక గొప్ప అనుభూతిని నింపింది. గొప్ప ఉత్తేజాన్నిచింది.

నాలుగు భాగాలుగా జరిగిన కవిత్వ కార్యశాలలో మొదట ప్రారంభ సభలో ప్రముఖ కవులు గంటేడ గౌరునాయుడు, ఎల్.ఆర్. స్వామి మరియు సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వొరప్రసాద్ మాట్లాడారు. రెండవ భాగం కవిత్వ కార్యశాలలో సీతారాం గారి తరువాత ఎస్వీయూనివర్శిటీ ప్రొఫెసర్ డాక్టర్ మేడిపల్లి రవికుమార్ గారు కొనసాగింపుగా మాట్లాడుతూ కవిత్వం చిక్కగా వుండాలని, వ్యర్థపదాలతో అనవసర అర్థాలతో భావాలను కప్పేయరాదని, భావగాఢత, చక్కని అభివ్యక్తి కవిత్వానికి అవసరమని అన్నారు. వచన కవితా నిర్మాణలపై ఆయన భోదించారు.

కవులలో కవిత్వ రచనపై సమగ్ర అవగాహన కల్పించేందుకు సాహితీ స్రవంతి ఈ కార్యక్రమం చేపట్టింది. వైజాగ్ ఫెస్ట్‌లో గురజాడ సాహిత్య వేదికపై ఉత్తరాంధ్ర కవులు వినిపించిన కవితలను, మరికొన్ని సేకరించిన కవితలతో "చైతన్య స్వరాలు" పేరిట కవితా సంకలనం ప్రచురించడం జరిగింది. ఈ సంకలనం వెలవడడానికి వైజాగ్ ఫెస్ట్ నిర్వాహకులు ఆర్థిక సహాయం అందించారు. వైజాగ్ ఫెస్ట్ కార్యదర్శి వి.అజయ్ శర్మగారు ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. ప్రముఖ కవి రామతీర్థ ఉత్తేజభరితంగా పుస్తక సమీక్ష చేశారు. సాహితీ స్రవంతి ఆధ్వర్యాన ఇలాంటి కృషి జరగడం అభినందనీయమని అన్నారు. సమకాలిన సమస్యలపైనా, అవక తవకలపైనా కవులు స్పందించాలని, బధిరాంధక పాలకులు కళ్ళు తెరిచేలాగ అక్షరగర్జనలు చేయించాలని పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమానికి సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు ఎ.వి. రమణారావు అధ్యక్షత వహించారు.

చివరిగా ప్రముఖులతో ముఖాముఖి కార్యక్రమం జరిగింది. హాజరైన కవులు కవయిత్రులు అడిగిన అనేకమైన సందేహాలకు సమాధానమిచ్చిన వొరప్రసాద్, సీతారాం, రామతీర్థ, చీకటి దివాకర్ ఈ కార్యక్రమాన్ని ఆద్యంతం ఆసక్తిగా జరిపించారు. ఈ కార్యశాల ఉత్తరాంధ్ర జిల్లాలకే పరిమితమైనప్పటికీ పత్రికలో ప్రకటన చూసి చిత్తూరు, నెల్లూరు, కడప నుండి కొందరు హాజరైనారు. నెల్లూరు నుండి వచ్చిన రమేష్ తనకు కవిత్వంమంటే ఎంత ప్రేమో వివరించారు. తన కవిత చదివి వినిపించారు. అందరి ప్రశంసలు అందుకున్నాడు.

సాహితీ స్రవంతి బాధ్యులు ఎ.వి. రామణారావు, చీకటి దివాకర్, నూనెల శ్రీనివాసరావు, చింతాడ రామారావు, ఎస్.వి. ఆర్.కృష్ణారావు, సత్యాజీ, ఎస్. నాగరాజు, చంద్రికారాణి, తదితరులు ఈ కార్యశాల సమన్వయకర్తలుగా వ్యవహరించారు. కార్యక్రమానికి హాజరైన వారందరికి చక్కని విందుభోజనం ఏర్పాటు చేయబడింది. కార్యక్రమానికి వచ్చిన ప్రతీ ఒక్కరూ ఇటువంటి కార్యశాలని భవిష్యత్తులో మరిన్ని నిర్వహించాలని కోరారు.

• నూనెల శ్రీనివాసరావు,

## కలంపై నిర్బంధం తగదు




తెలంగాణ సాహితి ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో ఆగస్టు 12న కంచ ఐలయ్యపై పెట్టిన కేసుకు వ్యతిరేకంగా జరిగిన సదస్సులో ప్రసంగిస్తున్న కవి యాకూబ్. చిత్రంలో తంగిరాల చక్రవర్తి, జి. యాదగిరి రావు.

తెలంగాణ సాహితి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో ఆగస్టు 12న సుందరయ్య విజ్ఞానేంద్రంలోని టిపికెఎస్‌లో 'కంచ ఐలయ్య'పై కేసు పెట్టడానికి వ్యతిరేకంగా సదస్సు జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న కవి యాకూబ్ మాట్లాడుతూ 'కలంపై నిర్బంధాలు తగవు. ఇది భావ ప్రకటనా స్వేచ్ఛకు విరుద్ధం. దీన్ని ప్రజాస్వామిక వాదులంతా ఖండించాలని అన్నారు. ఇటీవల పరిశీలనాత్మక వ్యాసం రాసిన ప్రొ॥ కంచ ఐలయ్యపై కేసు పెట్టడాన్ని తప్పుబట్టారు. ఇది కవులు, రచయితల నిర్బంధానికి సంకేతమన్నారు. బాధ్యత కలిగిన కవులు, రచయితలు, కళాకారులు ఎవరి జీవితం వారిదిగా చూడకూడదన్నారు. సమ్మెలు జరుగుతున్నప్పుడు, రోడ్లపై జనం బైఠాయించినప్పుడు, జెండాలు పట్టుకొని ఉద్యమాలు చేస్తున్నపుడు అవి మనకోసమే, సమాజ హితం కోసమేనని కవి స్పృహ కలిగి ఉండాలన్నారు. ఆ ఉద్యమాలు మనిషి మనుగడకోసమేనన్న అభిప్రాయం కవిలో కలగాలన్నారు. కవి ఎక్కడ నుండో రాడని, సమాజంలోని సమస్యలే కవిని పుట్టిస్తాయని అన్నారు. అనంతరం కవి సమ్మేళనం జరిగింది. కవి గేరా రాసిన 'సింగపూర్ రంగుల కల' అన్న కవిత రైతు ఈతి బాధల్ని కళ్లకు కట్టించింది. పొత్తూరి సుబ్బారావు రాసిన 'కలం నాదైతే ఇష్టం వారిదా?' అన్న కవిత భావ ప్రకటనా స్వేచ్ఛపై రాజ్యం నిర్బంధం ప్రజాస్ఫూర్తికి విరుద్ధమైందన్న సత్యాన్ని వ్యక్తీకరించింది. సుతారపు వెంకటనారాయణ 'కలమనే హలంతో కుళ్ళిపోతున్న సమాజాన్ని దున్నేస్తా, సంస్కారమనే మొక్కల్ని మొలిపిస్తా అంటూ ఆవేశంగా కవిత చదివారు. ఈ కార్యక్రమానికి తంగిరాల చక్రవర్తి అధ్యక్షత వహించారు. జి. యాదగిరి రావు, ఎస్. విజయలక్ష్మి, ప్రభాకరచారి, జి. నరేష్, మహేష్‌దుర్గే, అనంతోజు మోహనకృష్ణ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.




అనంతపురంలో ప్రెస్‌క్లబ్‌లో జూలై 7న జరిగిన ఎల్.ఆర్. వెంకటరమణ కవితా సంపుటి 'కవిత్వోదయం' ఆవిష్కరణ సభ. చిత్రంలో డా॥ రాధేయ, సింగమనేని నారాయణ, టి. రాజారాం, మల్లెల, ఎల్.ఆర్. వెంకటరమణ, లంక ప్రసాద్.



విశాఖ పౌరగ్రంథాలయంలో జూలై 3న బలివాడ కాంతారావు స్మారక జయంతి పురస్కారం అందుకుంటున్న అంగర సూర్యారావు. చిత్రంలో గొల్లపూడి మారుతీరావు, అదపా రామకృష్ణ, డిఎస్‌వి గోపికృష్ణ, ఆకాశవాణి డైరెక్టర్ ఎ. మల్లేశ్వరరావు, శిరల సన్యాసిరావు, ఏవిఆర్ మూర్తి తదితరులు



## కొండ్రెడ్డి కి శిలపరశెట్టి పురస్కారం

ఉత్తరాంధ్రకు చెందిన శిలపరశెట్టి రాములు నాయుడు స్మారక కవితా పురస్కారం - 2014కు గాను విమర్శకులు, కవి కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి కవితా సంపుటి 'ఎప్పటికీ కొత్తగానే' ఎంపికైనట్లు అవార్డు వ్యవస్థాపకులు మాధవీ సనారా ఒక ప్రకటనలో తెలియజేశారు. అవార్డు న్యాయనిర్ణేతలుగా మానేపల్లి సత్యనారాయణ, డా.డి.వి. సూర్యారావులు వ్యవహరించారని తెలిపారు.



విజయనగరంలో ఆగస్టు 9న చలసాని ప్రసాద్ సంస్మరణ సభ, చైతన్య స్వరాలు పుస్తకావిష్కరణ సభలో ప్రసంగిస్తున్న సాహితీప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి. చిత్రంలో సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్, డా॥ దివిజి శంకరరావు, కవి పాయల మురళీకృష్ణ.



కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూలై5న జరిగిన రాపాక దొరబాబు రాసిన 'మిత్రమా ఓ మాట' వ్యాసంపుటి ఆవిష్కరణ కార్యక్రమం. చిత్రంలో అద్దేపల్లి రామమోహనరావు, శ్రీపాద సూర్యప్రకాష్‌రావు, కత్తికొండ ప్రతాప్ తదితరులు

## పాతూరి మాణిక్యమ్మ పురస్కారం

పాతూరి మాణిక్యమ్మ స్మారక సాహిత్య పురస్కారం-2015 కు విశాఖపట్నానికి చెందిన జగద్ధాత్రి రాసిన 'సహచరణం' కవితా సంపుటి ఎంపికయ్యిందని పురస్కార వ్యవస్థాపక అధ్యక్షురాలు శ్రీమతి పాతూరి అన్నపూర్ణ ఒక ప్రకటనలో తెలిపారు. సెప్టెంబర్ 6న నెల్లూరులోని పురమందిరం ప్రాంగణంలో జూ॥రేబాల లక్ష్మీనరసారెడ్డి స్మారకభవనంలో జరిగే సభలో ఈ పురస్కారాన్ని అందివ్వనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కార ఎంపికకు డా॥ రాధేయ, కొప్పర్తి, నామాడి శ్రీధర్‌లు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారని తెలిపారు.

## కలేకూరి ప్రసాద్ స్మారక సాహిత్య పురస్కారం

బహుజన రచయితల వేదిక ఆంధ్రప్రదేశ్ పక్షాన ప్రముఖ కవి, రచయిత కలేకూరి ప్రసాద్ స్మారక సాహిత్య పురస్కారం -2015 కోసం దాదాపు 150 మందికి పైగా కవులు తమ కవితా సంపుటాలు పంపించినట్లు కన్వీనర్ నూకతోటి రవికుమార్ ఒక ప్రకటనలో తెలిపారు. ప్రధాన పురస్కారం నగదు బహుమతి రూ.5,116 లుకు 'ఎగరాల్సిన సమయం' కవితా సంపుటి రాసిన బాలసుధాకర్ మౌళి(నెల్లిమర్ల గ్రామం, విజయనగరం జిల్లా) ఎంపికయ్యారని తెలిపారు. జూరి అవార్డుల విజేతులుగా: చిన్ని నారాయణరావు-'గుండెదీపం' (నెల్లూరు), ర్యాలి ప్రసాద్-'పునాస నీడ'(కాకినాడ) డా॥ చిల్లర భవానీదేవి-రగిలిన క్షణాలు' (హైదరాబాద్) దుగ్గినపల్లి ఎజ్రాశాస్త్రి- పంచమాగ్ని' (ఒంగోలు), మోకా రత్నరాజు-'ట్రంకుపెట్టె' (విశాఖపట్నం), మహమ్మద్ ఖాన్ - కాల సూచికలు'(విజయవాడ), తేళ్ళపురి సుధీర్‌కుమార్ - శిథిల చిత్రాల జాతర' (కోయిలకుంట్ల, కర్నూలు), పి. శ్రీనివాస్ గౌడ్- ఒక మెలుకువ' (చీరాల) ఎన్నికయ్యారని తెలిపారు.

## పోస్ట్‌కార్డు కథల పోటీ

చలపాక ఈశ్వరమ్మ స్మారకార్థం రమ్యభారతి ఆధ్వర్యంలో పోస్ట్‌కార్డు కథల పోటీలను నిర్వహిస్తున్నట్లు రమ్యభారతి సంపాదకులు చలపాక ప్రకాష్ ఒక ప్రకటనలో తెలిపారు. కథలను సెప్టెంబర్ 30లోపుగా 'రమ్యభారతి', పోస్ట్‌బాక్స్ నెం. 5, విజయవాడ-520 001' చిరునామాకు పంపించ వలసిందిగా కోరారు.

## చిన్న కథల పోటీలు

సోమేపల్లి హనుమంతరావు స్మృత్యర్థం సోమేపల్లి పురస్కారాలకు చిన్న కథలను ఆహ్వానిస్తున్నట్లు సోమేపల్లి వెంకటసుబ్బయ్య ఒక ప్రకటనలో తెలిపారు. కథలను సెప్టెంబర్ 30లోపుగా 'రమ్యభారతి', పోస్ట్‌బాక్స్ నెం. 5, విజయవాడ-520 001' చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9247475975 ద్వారా సంప్రదించవచ్చును.

## కలాం స్మృతిలో కవితా సంకలనం

మాజీ రాష్ట్రపతి, శాస్త్రవేత్త ఏ.పి.జె. అబ్దుల్ కలామ్ స్మృతి సూచికంగా గుంటూరు జిల్లా రచయితల సంఘం 'వచన కవితా సంకలనం' ప్రచురించనున్నట్లు ఆ సంస్థ కార్యదర్శి ఎస్.ఎమ్. సుభాని ఒక ప్రకటనలో తెలిపారు. కలాం వ్యక్తిత్వం, జీవితం, ఆయన చేసిన సేవలు అంశంగా 30లైన్లకు మించకుండా వచన కవితలను సెప్టెంబర్ 15లోపుగా కోసూరి రవికుమార్, ప్రధాన కార్యదర్శి, జిల్లా రచయితల సంఘం, నారాయణపురం, దాచేపల్లి పోస్టు, గుంటూరు జిల్లా - 522 414 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు సయ్యద్ జానీభాషా-9441409749, బుర్రి కుమార్ రాజా- 8341641735 ద్వారా సంప్రదించవచ్చును.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad.

# గురజాడ అప్పారావు

21.09.1862 - 30.11.1915



'ముత్యాలసరాలు' కవిత్వంలోనూ 'కన్యాశుల్కం'తో నాటకరంగంలోనూ సంచలనం సృష్టించారు. మానవతా సందేశంతో నవకవిత్వానికి నాంది పలికారు. వాడుక భాష వ్యాప్తికోసం గిడుగుతో కలిసి పోరాడారు. ఇతివృత్తాలలోనూ, పాత్రల ఎంపికలోనూ నూతన సంప్రదాయాలను ప్రవేశపెట్టారు. మూఢనమ్మకాలను త్రోసిపుచ్చారు.

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/13-15
Date of Positng : 30.08.2015 . Date of Publication: 27.08.2015



# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల : రూ.50/-




వెల : రూ.150/-




వెల : రూ.150/-




వెల : రూ.25/-




వెల : రూ.30/-




వెల : రూ.125/-




వెల : రూ.80/-




వెల : రూ.200/-




వెల : రూ.150/-




వెల : రూ.50/-

## మాక్సీం గోర్కీ సమగ్ర రచనలు






వెల : రూ.200/-




వెల : రూ.270/-




వెల : రూ.120/-




వెల : రూ.200/-




వెల : రూ.60/-




వెల : రూ.200/-




వెల : రూ.70/-




వెల : రూ.125/-

ప్రజాశక్తి బుక్‌హౌస్, ప్లాట్. నె. 21/1, ఎం.హెచ్.భవన్, ఆజామాబాద్ హైదరాబాద్ - 20, ఫోన్ : 27608107, 9490099202, 9490618942



If Un delivered please return to: Prasthanam, C/oM.B. Vignana kendram, D. No. 27-30-3, 3rd Floor,

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A163 |
| పుస్తకం పేరు | లేఖ [illegible] |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Fౌaveen |
| పేజీలు విడదీసినది | Fౌaveen |
| స్కాన్ చేసినది | Rachitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |